# మీ పిల్లలకి కాల్షియం-శాండోజ్ ఎందుకు ఇవ్వాలి ?





## 32 గట్టి పళ్ల కోసం. పటిష్టమైన ఎముకల కోసం!

పిల్లల యొక్క పళ్ళూ, ఎముకలూ పెరగటానికి పెద్దలకన్న రెట్టింపు కాల్షియం కావాలి. అందుకే పిల్లలకు రోజుకు కమ్మని, రాస్ప్‌బెరీ రుచిగల కాల్షియం-శాండోజ్ 4-6 బిళ్ళలు యిస్తే చాలు, పళ్ళు గట్టిబడి ఎముకలు పటిష్టమవుతాయి. దానితో బాటు వాళ్ళకు విటమిన్ సి, డి, బి12 కూడా అందుతుంది.

ముఖ్య విషయం: కాల్షియం-శాండోజ్‌లో, మీ శరీరం బాగా ఉపయోగించుకుంటుందని డాక్టర్లు చెప్పే కాల్షియం గ్లూకోనేట్ ఉంది.

> పెరుగుదలకు కాల్షియం
> కాల్షియం తీసుకున్న పిల్లలు, కాల్షియం తీసుకోని వారికన్న 4 నెలలలో చాలా ఎక్కువగా ఎదిగారని శాస్త్రీయ పరిశోధన ఋజువు చేసింది.




**కాల్షియం-శాండోజ్®**

ప్రతి రోజు ప్రతివారికి

dCA/CS/14 A TEL.






















**ఉచితం**
ఆకర్షణీయమైన
అమర్ చిత్ర కథా కామిక్
20 పాపిన్స్ లేక గాల్లిన్స్
పైకాగితాలకు
బదులుగా

నోరూరించే మనసుదోచే మైమరపించే

**పార్లే పాపిన్స్**

పండ్లరుచిగల పిప్పరమెంట్లు






వారికే కామిక్ పుస్తకాలు:
1. శకుంతల
2. రాణా ప్రతాప్
3. శివ పార్వతి
4. భీష్మ
5. బండా బహదూర్
6. పద్మిని
7. జాతక కథలు
8. వాల్మీకి
9. తారాబాయి
10. రంజిత్ సింగ్

ఇంగ్లీష్-హిందీ-మరాఠీ-గుజరాతీ
భాషలలో దొరుకుతాయి.
పై కాగితాలను మీ పేరు, చిరునామాతోపాటు కావలసిన కామిక్ పుస్తకం నంబర్ (లు), ఏ భాషలో కావాలో రాసి ఈ దిగువ చిరునామాకు పంపండి.

పార్లే ప్రోడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ నిర్లాన్ హౌస్, 254 బి, డా. అని బెసెంట్ రోడ్, బొంబాయి 400 025.

everest/538/PP-tl



# చందమామ

## ధరలో మార్పు

"చందమామ" ను పాఠకులకు రూపాయి మించని ధరలో అందజేయాలని మేము శాయశక్తులా ప్రయత్నించాము. ఇతర పత్రికల ధరలు పెరిగినప్పుడు కూడా మేము "చందమామ" ధర పెంచలేదు.

కాని అది సాధ్యం కాని పరిస్థితి ఏర్పడింది. అన్ని వైపులా ఖర్చులు పెరిగిపోతున్నాయి. ఆ కారణం చేత నవంబరు 1976 సంచిక నుంచి "చందమామ" ధర రు. 1. 25 చేయ నిర్ణయించాము. ధర పెరుగుదలతోబాటు నాలుగు పేజీలు పెరుగుతాయి. చందమామలో పాఠ్యాంశాలు ఇంకా ఎక్కువగానే పెంచగలము. ఇందుకొరకు "చందమామ" లో కొన్ని చిన్న చిన్న మార్పులు చేస్తున్నాము. అవి పాఠకులకు నచ్చుతాయనీ, ధర పెరుగుదలను పాఠకులు సహించగలరనీ ఆశిస్తున్నాము.

ప్రకాశకులు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

నాగరికత మనిషి యొక్క ఔన్నత్యానికి నిదర్శనమని చెప్పటానికి లేదు. ఒక్కొక్కసారి నాగరికులకన్న అనాగరికులే గొప్ప వ్యక్తిత్వం చూపుతారు. బేతాళకథ [ "బంధవిముక్తి" ] లో అనాగరికుడైన భిల్లయువకుడు ఎక్కువ ఆత్మాభిమానమూ, నిజమైన ప్రేమా కనబరుస్తాడు. అతనితో పోల్చితే రాజూ, అతని చెల్లెలూ చాలా అల్పులనిపిస్తారు. వారిలో నిజమైన ఆత్మగౌరవం కూడా ఉన్నట్టు లేదు.

సంపుటి 59 అక్టోబర్ '76 సంచిక 4





## 40

వినయవతి కటిక చీకటిలో దైవాధీనాన్ని పోల్చుకోలేక, అతనితో గాంధర్వ వివాహం జరిపింది.

వివాహవిధి ముగిసినాక ఆమె ప్రేమగా అతన్ని, "ప్రియా, ఈ శుభవేళ మౌనంగా ఉన్నావెందుకు?" అని అడిగింది.

"దైవనిర్ణయం దాటరానిది," అన్నాడు దైవాధీనం.

ఈ మాట విని ఆమె నిర్ఘాంతపోయి, "తొందరపాటుతో ప్రవర్తించిన ఫలితం ఇలాగే ఉంటుంది," అనుకుని, ఏడుస్తూ, అతన్ని వెళ్ళగొట్టింది.

భటుడి ఇంటి నుంచి వెళ్ళగొట్టబడిన దైవాధీనం వీధులవెంట నడుస్తూ ఒక పెద్ద ఊరేగింపును చూసి, దానిలో చేరి నడవ సాగాడు. ఆ ఊరేగింపు ఏమిటంటే, మరొక నగరానికి చెందిన వరకీర్తి అనే గొప్పవర్తకుడు ఏనుగు మీద ఎక్కి, పెళ్ళి చేసుకునేటందుకు వధువు ఇంటికి ఊరేగింపుగా వెళుతున్నాడు.

ముహూర్తంవేళ సమీపించింది. వివాహ మంటపంలో పెళ్ళికూతురు పీటల మీద కూర్చుని ఉన్నది. ఆమె అప్సరసలాటి అందగత్తె. వరకీర్తి ఏనుగు మీది నుంచి దిగి, వివాహమంటపం లోకి అడుగు పెట్టుతూండగా, ఆ ఏనుగుకు మదోద్రేకం వచ్చి, మావటివాణ్ణి చంపి, వివాహ మంటపంలోకి పరిగెత్తింది. అదిచూసి భయపడి, పెళ్ళికూతురును పీటల మీద ఒంటరిగా వదిలేసి, పెళ్ళికొడుకుతో సహా అందరూ మంటపం నుంచి దూరంగా పారిపోయారు.

దైవాధీనం పెళ్ళికూతురి కళ్ళలో బెదురు చూసి, ఆమెను సమీపించి, ఆమె

అట్ట చివరి బొమ్మ

చేతిని తన చేతిలోకి తీసుకుని, "భయ పడకు, నే నున్నాను," అన్నాడు.

ఆమె భయంతో అతన్ని గట్టిగా కౌగ లించుకున్నది. ఆ క్షణంలోనే ఆమె అతన్ని ప్రేమించింది.

అతని మొండిధైర్యం చూసి ఏనుగు బిత్తరపోయింది. అతను గట్టిగా అరిచి, ఏనుగును కల్యాణ మంటపం నుంచి బయటికి పంపేశాడు.

వరకీర్తి తనవారితో సహా కల్యాణ మంటపానికి తిరిగివచ్చి చూసేసరికి, తనను పెళ్ళాడవలసిన కన్య చేయి మరొకడి చేతిలో ఉన్నది.

అతను కోపంగా వధువు తండ్రిని, "నా కిస్తానన్న పిల్లను మరొకరికి ఎందు కిచ్చారు ?" అని అడిగాడు.

"నేనూ మీ అందరిలాగే భయపడి పారిపోయాను. అందుచేత ఇదంతా నాకూ తెలీదు," అన్నాడు కన్యాదాత.

తరవాత ఆయన తన కుమార్తె కేసి తిరిగి, "అమ్మా, నీ ప్రవర్తన ఆక్షేప ణీయంగా ఉన్నది. మరొకరిని పెళ్ళాడ వలసిన దానివి, ఇతని చేతిలో చెయ్యిపెట్టి ఉండటానికి కారణం చెప్పు," అన్నాడు.

"ఇతను నా ప్రాణం కాపాడాడు. నా బొందెలో ప్రాణం ఉండగా మరొకరిని పెళ్ళాడను," అన్నదామె.



ఆమె ఇలా అనేసరికి వరకీర్తి పక్షం వారికీ, పిల్లపక్షం వారికీ మధ్య తెల్లవార్లూ పోట్లాట జరిగింది.

ఈ పోట్లాట గురించి నగరమంతా పాక్కింది. అందులో దైవాధీనానికి ప్రమేయం ఉందని తెలిసి, రాజకుమార్తె చంద్రమతీ, భటుడికూతురూ కుతూ హలం కొద్దీ అక్కడికి వెళ్ళారు.

జగడం పెద్ద ఎత్తున సాగింది. వరకీర్తి చూడబోతే మరో దేశానికి చెందిన కోటీశ్వరుడు. అందుచేత విచారించటానికి రాజే స్వయంగా బయలుదేరి వచ్చాడు. "దీనికంతకూ మూలకారణమేమిటి ?" అని ఆయన దైవాధీనాన్ని అడిగాడు.

అతను చంద్రమతినీ, భటుడి కూతురునూ, వర్తకుడి కూతురునూ సాభిప్రాయంగా చూసి, "విధి నిర్ణయం జరిగి తీరుతుంది," అని, తనను బలపరచమన్నట్టు రాజకుమార్తె కేసి చూశాడు.

ఆమె తనకు జరిగినది తలుచుకుని, "దాన్ని ఈశ్వరుడు కూడా తప్పించలేడు," అన్నది.

తరవాత దైవాధీనం భటుడి కూతురు కేసి చూశాడు.

"అందుకే నేను జరిగినదానికి సంతోషించను, విచారించను," అన్నదామె.

వర్తకుడి కుమార్తె ఈ మాటల దృష్ట్యా తన అనుభవం గురించి ఆలోచించి, "నా కోసం నిర్ణయించబడినది నాకు కాకుండా పోవటం ఎన్నడూ జరుగదు," అన్నది.

ఈ నలుగురూ అన్నమాటలు విని రాజుతోబాటు అక్కడ ఉన్నవారందరూ తికమకపడ్డారు. రాజు దైవాధీనానికీ, ముగ్గురు స్త్రీలకూ అభయం ఇచ్చి, నిజం దాచకుండా చెప్పమన్నాడు.

అందరూ తమ తమ కథలు చెప్పారు.

రాజు దైవాధీనంతో, "నువు చూడగా విధికి ముద్దుబిడ్డలాగా కనబడుతున్నావు. దానికి తోడు నీకు ధైర్యమూ, సమయస్ఫూర్తీ కూడా ఉన్నాయి. నాకు కొడుకులు లేరు. అందుచేత నువు నా కుమార్తెను పెళ్ళాడి, నా రాజ్యానికి వారసుడివి కా. పెళ్ళి కాగానే నీకు వెయ్యి గ్రామాలు రాసి ఇచ్చి, నిన్ను యువరాజుగా ప్రకటిస్తాను. ఉన్న పరిస్థితులలో నువు భటుడి కూతుర్నీ, వర్తకుడి కూతుర్నీ కూడా పెళ్ళాడక తప్పదు. అందుకు నా అనుమతి ఇస్తున్నాను," అన్నాడు.

అదృష్టవంతుడైన ఆ యువకుడు ముగ్గురు వధువులనూ వైభవంగా పెళ్ళాడి, వారితో సుఖంగా జీవించాడు. అతని తండ్రీ ఇతర బంధువులూ అతని సమర్థత గ్రహించి, అతనితో రాజీపడి, అతని వెంటే ఉంటూ వచ్చారు.





# మాయాసరోవరం

## 10

[చరకాచారి దగ్గిరకు వచ్చిన మొసలిఆకారంవాణ్ణి, నేర్పుగా పట్టుకుని, ఆతడి వాహనం జలగ్రహం మీద ఎక్కి జయశీలుడూ, సిద్ధసాధకుడూ హిరణ్యపురం కేసి బయలుదేరారు. దారిలో ఒక చెట్టు మీదినుంచి బోయభీమన్న, మొసలిఆకారంవాణ్ణి బాణంతో కొట్టాడు. జలగ్రహం పోయి వాడున్న చెట్టును కూకటివేళ్ళతోపాటు పెకలించింది. తరవాత—]

బోయభీమన్న ప్రాణభయంతో కేకలు పెడుతూనే, చెట్టుతోపాటు కిందపడ్డాడు. జయశీలుడు, మకరకేతు భుజం పట్టుకుని గట్టిగా కుదిలిస్తూ, "ఒరే, మొసలి తొడుగు దుష్టుడా! ఇప్పుడు నువ్వు చేసిన పనేమిటి? నా అనుమతి లేకుండా జలగ్రహాన్ని చెట్టును పెళ్ళగించేందుకు ఎందుకు ఉసికొల్పావు?" అన్నాడు కోపంగా.

మకరకేతు తన ఎడమ భుజంలో దిగిన బాణం కేసి తలతిప్పి చూసి, బాధతో ఒకసారి మూలిగి, "జయశీలా, నేను ఆ బోయవాణ్ణి యిలా నేల పడగొట్టించక పోతే, వాడు మరో బాణాన్ని వదిలి, నా గుండెల్నే చీల్చేవాడు. అది నిజం కాదంటావా?" అన్నాడు.

ఈ మాటల్లో వున్న సత్యాన్ని జయశీలుడు గ్రహించాడు. కాని, అతడికి



మకరకేతు తన ఆజ్ఞను ధిక్కరించటం చిరాకు తెప్పించింది. ఈ లోపల సిద్ధసాధకుడు జలగ్రహం మీది నుంచి కిందికి దూకి, కొమ్మల్లో చిక్కుకుని, బయిటికి వచ్చేందుకు నానా అవస్థా పడుతున్న బోయభీమన్నను బయిటికి లాగాడు.

"ఒరే, బోయవెధవా! నీ కాళ్ళూ, చేతులూ ఏమైనా విరిగిన య్యేమో చూసుకో," అన్నాడు సిద్ధసాధకుడు, బోయభీమన్న కేసి జాలిగా చూస్తూ.

బోయభీమన్న ఎగిరిగంతేసి, "దయ్యాల పోతు దొరా! నాకేం దెబ్బలు తగల్లేదు: అలా చెట్టు మీదినుంచి గరుడపక్షి కిందికి వాలినట్టు వాలాను. ఈ మొసలిముచ్చు నా బాణం దెబ్బ తినీ, యింకా యీ పిశాచి ఏనుగు మీద కూర్చుని వుండటం, నాకు తల తీసేసినట్టుగా వున్నది. ఈసారి నా బాణం వాడి గుండెల్లో దిగబోతున్నది! మీరే చూస్తారు," అంటూ బాణం ఎక్కుపెట్టబోయాడు.

సిద్ధసాధకుడు చప్పున వాడి చెయ్యి పట్టుకుని, జలగ్రహం మీద వున్న జయశీలుడితో, "జయశీలా! ఇప్పుడు యీ బోయ భీమన్నకు, మొసలి ఆకారం వాడి గుండెలు చీల్చేందుకు అనుమతి యిద్దామంటావా?" అన్నాడు

ఆ ప్రశ్న వింటూనే జయశీలుడు జలగ్రహం మీదినుంచి కిందికి దూకి, బోయభీమన్న మెడ పట్టుకుని, "ఒరే, పొగరుబోతు వెధవా! ఆ ఏనుగు మీద నేనుండటం చూసి కూడా, బాణం వదులుతావా? అది గురి తప్పి నాకు తగలవచ్చన్న అనుమానం కూడా నీకు కలగలేదా?" అని అడిగాడు.

"దొరా, నా బాణం గురి తిరుగులేనిది. కావాలంటే ఆ మొసలి వేషంగాడి రెండు కనుబొమల మధ్య దిగేలా బాణం కొట్టగలను," అంటూ భీమన్న విల్లంబు ఎత్తాడు.

జయశీలుడు వెంటనే వాడి చేతిలో వున్న విల్లంబులను గుంజుకుని దూరంగా

పారవేసి, "ఇప్పుడు ఆ మకరకేతు నా అధీనంలో వున్నాడు. వాణ్ణి రాజుగారి దగ్గిరకు తీసుకుపోతున్నాను. నువ్వు అతడికెలాంటి హాని కలిగించినా, నిన్ను ప్రాణాలతో వదలను," అన్నాడు కోపంగా.

"మరి, నా అడవి కోడి మాటేమిటి, దొరా? దాన్ని వాడు దొంగిలించాడు," అన్నాడు బోయభీమన్న.

"ఒరే, భీమా, యిక నోరు మూసుకో. కావాలంటే పోయి ఆ కోడి సంగతి రాజుగారితో చెప్పుకో," అన్నాడు సిద్ధసాధకుడు, బోయవాణ్ణి భుజం పట్టుకుని పక్కకు లాగుతూ.

ఆ సమయంలో అక్కడికి చరకాచారీ, వీరనారాయుడూ వచ్చారు. చరకాచారి జలగ్రహం మీద వున్న మకరకేతుడి కేసి చూస్తూనే ఆశ్చర్యపోయి, "ఇదేమిటి? డొక్కలో దిగిన కత్తితోపాటు, భుజంలో గుచ్చుకున్న బాణం కూడానా! ఈ మొసలి వేషగాడి రోజులు ఏమీ బాగోలేదు," అన్నాడు.

"ఛీ, యింతమంది మానవమాత్రుల వల్ల అవమానం పాలై, చావుదెబ్బలు తిని యింకా బతికి వుండటం కన్న చావు మేలు! ఏదీ, నా వాడి శూలం ఎక్కడ?" అంటూ మకరకేతు జలగ్రహం మీద వెతకబోయాడు.

సిద్ధసాధకుడు తన చేతిలో వున్న శూలాన్ని పైకెత్తి, "ఓయ్‌, మకరకేతూ! నీకున్న ఆ కాస్త బుద్ధీ పెడతలపట్టినట్టు





''జయశీల ప్రభూ, అలా చేయటం మంచిది కాదు. ముందు శస్త్రం చేసి ఆ కత్తినీ, బాణాన్నీ బయిటికి తీయక పోతే, మకరకేతుడి శవం మాత్రమే హిరణ్యపురం చేరుతుంది. కావాలంటే వీరనారాయుణ్ణి అడగండి,'' అన్నాడు చరకాచారి.

''ఆచారిగారు చెప్పింది, అక్షరాలా నిజం. వీణ్ణి ముందు మా గ్రామం తీసుకు పోయి, అక్కడ వైద్యం చేసి, ఒకటి రెండు రోజుల విశ్రాంతి తరవాత రాజుగారి దగ్గిరకు తీసుకుపోవటం తెలివైన పని,'' అన్నాడు వీరనారాయుడు.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ అదే మంచి మార్గంగా తోచింది. మకరకేతును ప్రాణాలతో కనకాక్షరాజుగారి దగ్గిరకు తీసుకుపోయి, అతడిచేత రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నదీ చెప్పించితే, తరవాత చేయవలసిందేమిటో రాజే నిర్ణయిస్తాడని జయశీలుడు భావించాడు.

ఆ వెంటనే జయశీలుడూ, సిద్ధసాధకుడూ జలగ్రహం మీదికి పోయి, మకరకేతుడితో, ''కేతూ! నీకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. నిన్ను ముందుగా యిక్కడికి దాపులనే వున్న గ్రామానికి తీసుకుపోయి, అక్కడ చికిత్స చేయించి, గాయాలు మానిన తరవాతే నిన్ను హిరణ్యా

న్నది. ఆ శూలాన్ని నా సొంతం చేసుకుని ఎంతసేపాయె!'' అన్నాడు.

మకరకేతు కళవెళపడిపోతూ చేతులు రెండూ పైకెత్తి, ''హాఁ, మాయాసరోవరేశ్వరా!'' అంటూ ఒక కేకపెట్టి, ''ఇంతకూ నన్నేం చేయబోతున్నారు? డొక్కలో, భుజంలో దిగిన ప్రాణాంతకమైన యీ కత్తీ, బాణం మాటేమిటి?'' అన్నాడు.

జయశీలుడు, చరకాచారిని దగ్గిరకు పిలిచి, ''ఆచారీ! యీ మకరకేతుణ్ణి యిలాగే హిరణ్యాపురం వరకూ తీసుకుపోవచ్చంటావా? ఏమిటి నీ సలహా?'' అని అడిగాడు.

పుర రాజుగారి దగ్గిరకు తీసుకుపోతాం,'' అన్నారు.

మకరకేతు చేతులు రెండూ ఎత్తి, ''అంతా, ఆ మాయాసరోవరేశ్వరుడి దయ! దారిలో మరొక బోయవెధవ, యీసారి కుడి భుజంలో బాణం కొట్టకుండా మాత్రం నన్ను కాపాడండి, అంతే చాలు!'' అన్నాడు.

''నీకలాంటి భయం ఏమీ వద్దు నేనూ, సిద్ధసాధకుడూ నీకు అభయం యిస్తున్నాం. ఊం, జలగ్రహాన్ని అదిలించు,'' అన్నాడు జయశీలుడు.

జలగ్రహం కదిలి, చరకాచారి చెప్పిన మార్గాన, వాళ్ళ గ్రామాని కేసి బయలు దేరింది. జయశీలుడు ఆలోచనలో పడ్డాడు. మకరకేతు యింతవరకు రెండు సార్లు తను వింటూ వుండగా, మాయా సరోవరేశ్వరు డనే వాడి పేరు భక్తితో స్మరించాడు. ఎవడీ మాయాసరోవరేశ్వరుడు? యీ ప్రశ్న మకరకేతును అడిగి ప్రయోజనంలేదు; వాడు ఎన్నటికీ నిజం చెప్పడు...

జయశీలుడు యిలా పరి పరి విధాల ఆలోచిస్తూండగా, హఠాత్తుగా ఎదురుగా వున్న చెట్ల గుంపుల్లో నుంచి డప్పుల మోతలూ, ఈలలూ వినిపించినై. ఆ గొడవ చేస్తున్న వాళ్ళు ఎవరై వుంటారా అని




జయశీలుడు చూసేంతలో, ముందు బోయవాళ్ళ దయ్యాలపోతూ, వాడి పక్కన డప్పులూ, విల్లంబులూ పట్టు కున్న పదీ పన్నెండుమంది బోయవాళ్లూ, చెట్ల గుంపుల చాటునుంచి బయిటికి వచ్చారు.

బోయ దయ్యాలపోతు చిందులు తొక్కుతూ, ''బలి! బలి! నేను బోయ మహంకాళిని! మొసలి మనిషి గొంతు కొరికి పుక్కిట పట్టిన రక్తంతో, నా కాళ్లకు పారాణి పెట్టాలి! అలా చేయకపోతే, లోకంలో వున్న బోయకులాన్నే విరుచుకు తింటాను! సర్వ నాశనం చేస్తాను,'' అని అరుస్తున్నాడు.



తన జాతి వాళ్లను చూస్తూనే జలగ్రహం వెనగ్గా, చరకాచారీ, వీరనారాయుళ్ళతో నడుస్తున్న బోయ భీమన్న, "తల్లీ, మాంకాళీ!" అంటూ ఒక కేకపెట్టి, సిద్ధసాధకుడితో, "రాజుగారి దయ్యాల పోతు, దొరా! మా గణాచారి పోతుగాణ్ణి, మా కులదేవత మాంకాళి ఆవేశించింది. ఆ తల్లి, యీ మొసలి ఆకారంగాడి నెత్తురు కావాలంటున్నది. వెంటనే వాణ్ణి ఏనుగు మీంచి కిందికి తోసెయ్యండి. తరవాత పని, మా గణాచారే చూస్తాడు." అన్నాడు.

వాళ్ళ దయ్యాలపోతును చూసి భీమన్నకూ ఆవేశం కలుగుతున్నదని గ్రహించిన జయశీలుడు, వీరనారాయుడికి కనుసైగ చేశాడు. వెంటనే వీరనారాయుడు, భీమన్న దగ్గిరున్న విల్లంబులు లాగేసుకున్నాడు. అదే సమయంలో జయశీలుడు, మకరకేతు చెవిలో ఏదో మెల్లిగా చెప్పాడు.

మకరకేతు భయం భయంగా ఒక క్షణం దిక్కులు చూసి, "జలగ్రహా! ఈ అడవి అనాగరిక వెధవని తొండానికి చుట్టి, పైకెత్తు! ప్రాణాలు మాత్రం తీయకు," అని కేకపెట్టాడు.

జలగ్రహం చప్పున తలతిప్పి, మెరుపులా పోయి, తొండంతో బోయ భీమన్న నడుం వడిశి పట్టుకుని పైకెత్తింది. భీమన్న కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ చావుకేకలు ప్రారంభించాడు.

"కేతూ, యిప్పుడు జలగ్రహాన్ని ఆ బోయవాళ్ళ కేసి నడుపు. నీ ప్రాణానికి వచ్చిన ముప్పేంలేదు. మంచిగా నామాట వినకపోతే, నేనూ, సిద్ధసాధకుడూ వాళ్లందర్నీ హతమారుస్తాం," అని భీమన్నతో, "ఒరే, భీమన్నా! మీ వాళ్ళనందర్నీ గొడవ చెయ్యకుండా వెనక్కు తిరిగి పొమ్మని చెప్పు. మా పైకి బాణాలు వదలటంలాటి పిచ్చి పనులేమైనా చేశారో, ముందు నువ్వు జలగ్రహం కాళ్ళ కింద నలిగి చస్తావు. తరవాత మీ వాళ్లనందర్నీ

నరికి పోగులు పెడతాను.'' అన్నాడు జయశీలుడు.

''జయశీల ప్రభో, అవేం మాటలు? బోయ మాంకాళి, మొసలి ముఖం వాడి నెత్తురు కావాలంటూంటే, మనం కాదని కాళీమాతకు కోపం తెప్పించగలమా?'' అన్నాడు బోయ భీమన్న గడగడ వణికిపోతూ.

''ఒరే, భీమన్నా, నాతో మొండిగా వాదించకు. ఈ మకరకేతు రాజుగారి బందీ. ఇతణ్ణి రక్షించవలసిన బాధ్యత నా మీద వున్నది. అర్థమైందా?'' అన్నాడు జయశీలుడు ఏనుగు మీదినుంచి ముందుకు వంగి, కత్తిని భీమన్న వెన్ను మీద ఆనించి.

''జయశీల ప్రభో, నన్ను కత్తితో పొడవకండి. మాంకాళి కోరలకన్న మీ కత్తి వాడిగా వున్నట్టుంది!'' అన్నాడు భీమన్న గిలగిల్లాడుతూ.

అంతలో అక్కడికి బోయగణాచారి జుట్టు పీక్కుంటూ, కీచుమని అరుస్తూ వచ్చాడు. వాడి వెంట వున్న బోయవాళ్లు, జలగ్రహం మీద వున్న వాళ్ళకేసి బాణాలు ఎక్కు పెట్టారు.

''జయశీలా, యిప్పుడేం చెయ్యటం?'' అన్నాడు మకరకేతు వణికిపోతూ.

''ప్రభో, ఆ మాటే మేమూ అడుగుతున్నాం!'' అన్నారు చరకాచారి, వీరనారాయుడూ జలగ్రహం వెనక దాక్కుంటూ.



"ఒరే, భీమన్నా, నే చెప్పినదేమిటి?" అంటూ జయశీలుడు భీమన్న వెన్ను మీద ఆనించిన కత్తిని కాస్త గట్టిగా వత్తాడు. అదేసమయంలో సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ తన చేతి లోని శూలాన్ని గిరగిరా తిప్పి, చప్పున బోయదయ్యాల పోతు గుండెల కేసి గురిచేశాడు.

భీమన్న రెండు చేతులూ ఎత్తి వణుకు తున్న గొంతుతో, "ఒరే, గండు మామా, బక్క చిన్నోడా! బాణాలు వదలకండి! దయ్యాలపోతయ్యో, జాగ్రత్త! ఈ ముసలి తలవాడు రాజుగారి మనిషట! అయన్ని జయశీల దొర హిరణ్యపురానికి తీసుకు పోతున్నాడు," అన్నాడు.

"నా కాళ్ళ పారాణి మాటేమిటి? వాడి రక్తం పారాణిగా పెట్టుకోందే నేను శాంతించను. నేను కాళిని, బోయమహం కాళిని!" అంటూ బోయగణాచారి జల గ్రహం కేసి రెండడుగులు ముందుకు వేశాడు.

జయశీలుడికి వాడి మొండితనం, అహంకారం చాలా కోపం తెప్పించింది. అతడు జలగ్రహం మీది నుంచి కుప్పించి కిందికి దూకి, మెరుపులాపోయి గణాచారి జుట్టుపట్టుకుని, వాణ్ణి నేలమీద విసిరికొట్టి, కత్తిని వాడి గుండెల కానించి, "అబద్దాల మారి వెధవా? ఇప్పుడు నిజం చెప్పు, నిన్నావేశించింది మహంకాళా? ఇప్ప, తాటిచెట్ల కల్లా?" అని అడిగాడు.

"నమ్మితినమ్మా, బోయ మహం కాళమ్మా, రక్షించు!" అంటూ గణా చారి కేకపెట్టాడు.

అతడి పక్కన వున్న బోయవాళ్లు విల్లంబులెత్తబోయేంతలో, సిద్ధసాధకుడు, "జై మహాకాళా!" అంటూ జలగ్రహం మీది నుంచి కిందికి దూకి, శూలం ఎత్తి వాళ్ళ కేసి పరిగెత్తాడు.

ఆ మరుక్షణం, "ఆగండి! ఆగండి!" అంటూ పది మంది అశ్వికులు ఈటెలు ఝుళిపిస్తూ వేగంగా వచ్చి, అందరినీ చుట్టుముట్టారు. —(ఇంకా వుంది)





# బంధవిముక్తి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు రాజులలో తప్పబుట్టావనాలి. రాజులకు నీలాగా స్థిరచిత్తం ఉండదు. వారు అకారణంగానే తమ ధోరణిని మార్చుకుంటూ ఉంటారు. ఇందుకు నిదర్శనంగా నీకు మహేంద్రపుర రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు :

మహేంద్రపుర రాజ్యాన్ని పాలించిన ధీరేంద్రసింహుడు చచ్చిపోబోతూ, తన కొడుకైన మహేంద్రుడితో, "నాయనా, నీ చెల్లెలు స్వయంప్రభకు పెళ్లిచేసి, ఆమె భర్తకు అర్ధరాజ్యం ఇయ్యి," అన్నాడు. అలాగే చేస్తానని మహేంద్రుడు మాట

## బేతాళ కథలు



ఇచ్చాడు. తరువాత ధీరేంద్రసింహుడు చావటమూ, యువరాజైన మహేంద్రుడు పట్టాభిషేకం చేసుకోవటమూ జరిగిపోయాయి.

ఒకసారి మహేంద్రుడు అడవిలో వేటాడుతూ ఒకచోట వాగు దాటవలసి వచ్చింది. రేవు వద్ద కాలిబాటకు అడ్డంగా ఒక భిల్లయువకుడు నిలబడి, ఎవరో భిల్లస్త్రీని రమ్మని పిలుస్తున్నాడు. ఆమె పూలు కోసుకుంటూ, "వస్తున్నా!" అంటూనే తాత్సారం చేస్తున్నది.

మహేంద్రుడు, దారికి అడ్డం లెమ్మన్న హెచ్చరికగా తన కత్తితో భిల్లయువకుడి తొడమీద తట్టాడు.

భిల్లయువకుడు వెనక్కు తిరిగిచూసి, ఉగ్రుడైపోయి, రాజు చేతిలోని కత్తి లాగేసి వాగులోకి విసిరివేస్తూ, "ఎంత పొగరురా నీకు! చంపేస్తాను!" అంటూ పళ్ళు కొరికి, మహేంద్రుడి మీద కలియబడ్డాడు.

ఇద్దరూ ముష్టియుద్ధంచేశారు. అందులో కూడా భిల్లయువకుడిదే పైచెయ్యి అయింది. అతను మహేంద్రుణ్ణి చంపబోతుండగా, పూలుకోస్తూ ఉండిన అతని చెల్లెలు పరిగెత్తుకుంటూ వచ్చి, "చంపకు, చంపకు! ఆయన రాజులాగున్నాడు," అన్నది.

ఆ మాట విని భిల్ల యువకుడు మహేంద్రుణ్ణి ప్రాణాలతో వదిలేస్తూ, "నా సంగతి ఇప్పటికైనా తెలిసింది గదా!" అన్నాడు.

అదే సమయంలో మహేంద్రుడి పరివారం వచ్చి రాజును చేరుకున్నది. అతను అవమాన భారంతో ఇంటికి తిరిగి వెళ్ళాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే రాజుగారి సైనిక దళం ఒకటి అరణ్యంలోకి వెళ్ళి, ఒంటరిగా చిక్కిన భిల్లయువకుణ్ణి పట్టుకున్నది. భిల్లయువకుణ్ణి రాజధానికి తీసుకుపోయి, ఖైదులో పెట్టారు.

మహేంద్రుడు ఆ భిల్ల యువకుణ్ణి రాజద్రోహిగా ప్రకటించి, మరణదండన

విధించుదామనుకున్నాడు గాని, మంత్రులు వారించారు. ఎక్కడో అడవిలో ఉండే ఆటవికుడు రాజద్రోహి అని నిరూపించటం ఎలా? విచారణ జరిగినప్పుడు వాడు తాను రాజును చంపినంత పని చేశానని నిండు సభలో బయట పెట్టితే రాజుకు అగౌరవమే కాకుండా, అతని చిన్న బుద్ధికూడా లోకానికి వెల్లడి అవుతుంది. అంతకన్నా గుట్టుచప్పుడు కాకుండా ఆ భిల్లయువకుణ్ణి కారాగృహంలో ఉంచితే, వాణ్ణి గురించి ఎవరూ పట్టించుకోరు.

రాజుకు మంత్రుల సలహా బావున్నట్టు తోచింది. ఆయన భిల్లయువకుణ్ణి ఖైదులో పెట్టించాడు.

కొన్నాళ్ళు గడిచినాక రాజు చెల్లెలైన స్వయంప్రభ ఖైదులో ఉన్న భిల్ల యువకుణ్ణి చూడవచ్చింది. అది మొదలు ఆమె అతనికి మంచి ఆహారం అందేటట్టు ఏర్పాటుచేసి, ఖైదులోకూడా అతనికి అనేక సదుపాయాలు అమరేటట్లు చూసింది.

ఈ విధంగా రోజూ స్వయంప్రభను చూస్తూ భిల్లయువకుడు ఆమెను ప్రేమించ సాగాడు.

ఒకనాడు అతను ఆమెతో, "నువ్వు నన్ను ప్రేమించబట్టే నాకు ఇలా జరిపిస్తు



న్నావు. నేనుకూడా నిన్ను ప్రేమిస్తున్నాను. నాతోపాటు పారిపోయి మా అడవికి వచ్చెయ్యి. అక్కడ హాయిగా జీవించుదాం," అన్నాడు.

స్వయంప్రభ అతనికి ఏమీ జవాబు చెప్పలేదు. పైపెచ్చు, ఆమె తిరిగి అతన్ని చూడటానికి రావటం కూడా మాను కున్నది.

ఇది జరిగిన కొద్ది రోజులకే భిల్ల యువకుణ్ణి కారాగృహాధికారులు వదిలి పెట్టేశారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మహేంద్రుడు భిల్లయువకుణ్ణి కసికొద్దీ ఖైదులో పెట్టి, అతన్ని చంపటానికి కూడా

ప్రయత్నించాడు గదా. అతన్ని అకస్మాత్తుగా ఎందుకు విడిచిపెట్టాడు? తనకు ఆ భిల్లయువకుడి వల్ల జరిగిన అవమానాన్ని మరిచాడా? అతని చెల్లెలి ప్రవర్తనకు అర్థం ఏమిటి? ఆమె ఖైదులో ఉన్న ఆ భిల్ల యువకుడికి అన్ని సదుపాయాలు ఎందుకు చేసింది? అతను ఆమెను తనతో వచ్చెయ్యమంటే జవాబు చెప్పకపోగా, అతని వద్దకు రావటం ఎందుకు మానేసింది? ఈ అనుమానాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు ప్రవర్తనకూ, అతని చెల్లెలి ప్రవర్తనకూ చాలా సన్నిహితసంబంధం ఉన్నది. మహేంద్రుడు భిల్ల యువకుణ్ణి పట్టి తెప్పించటానికీ, అతన్ని రాజద్రోహిగా ప్రకటించి మరణదండన విధింతామనుకోవటానికీ కారణం అతనికి భిల్ల యువకుడు చేసిన అవమానం కానేకాదు. ఆ భిల్లుడు పౌరుషమూ, పరాక్రమమూ గలవాడు; రాజు అంటే కూడా లక్ష్యం లేనివాడు. ఒకసారి రాజును ఓడించినాక అలాటి వాడికి తానే రాజు కావాలన్న కోరిక పుట్ట వచ్చు. అతను భిల్ల మూకలను వెంట బెట్టుకుని తన నగరం మీద దాడిచెయ్య వచ్చు. ఈ భయంతో రాజు భిల్లుణ్ణి ఖైదు చేయించాడు. ఈ భయానికి ఆధారం ఉన్నదో లేదో చూడటానికి అతని చెల్లెలు, ఖైదులో ఉన్న భిల్లుణ్ణి పరీక్షించింది. ఆమెను పెళ్ళాడితే అర్ధరాజ్యం వస్తుంది. ఆ అర్ధరాజ్యం మీద కూడా భిల్ల యువకుడు ఆశచూపక, ఆమెను తనతో అడవికి వచ్చెయ్యమన్నాడు. ఏ శ్రమా లేకుండా వచ్చే అర్ధరాజ్యం మీద ఆశలేనివాడు, యుద్ధంచేసి పూర్తిరాజ్యం సంపాదించ గోరుతాడా? అతను నిరపాయమైనవాడే నని ఇలా రుజువు అయింది. రాజు అతన్ని వదిలిపెట్టాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# సోనాపూర్‌లో ఉద్యమం

సీతను రాముడి కిచ్చి వైభవంగా పెళ్ళి చేశారు. రాముడు సీతను తన ఇంటికి తీసుకుపోయి సుఖంగా జీవించసాగాడు. ఇది రామాయణ కథ కాదు సుమండీ. ఈ సీత వీరనగరుకు చెందిన మంగళదాసు అనే రైతు కూతురు అతను స్థితిమంతుడు. సీత అతని కూతురు. ఆమె కన్నా నాలుగేళ్ళు పెద్దవాడు ఆమె అన్న హీరాదాసు. సీతకు పదహారేళ్ళప్పుడు ఆమెను సోనాపూరు రైతు అయిన రవిదాసు కొడుక్కు రామదాసుకు ఇచ్చి పెళ్ళిచేశారు.

పెళ్ళి అయిన ఏడాదికి రామదాసు తండ్రి చనిపోయాడు. రామదాసు జ్ఞాతులు ఏవో వ్యాజ్యాలు తెచ్చి, అతనికి తండ్రి ఆస్తి దక్కకుండా చేశారు. అతను సోనాపూరు పంచదార ఫ్యాక్టరీలో పనివాడుగా చేరి, శ్రమ చెయ్యసాగాడు.

సోనాపూర్ భూములు శ్రేష్ఠమైనవి. అక్కడ చెరుకు బాగా అయేది. దూరాన ఉండే పంచదార మిల్లులవాళ్లు ఇక్కడి చెరుకు కొనుక్కుపోయేవారు. కాలక్రమాన సోనాపూరులోనే ఒక పంచదార మిల్లు వెలసింది. ఎక్కడెక్కడినుంచో జనం వచ్చి చేరారు. అందులో మంచివాళ్ళూ ఉన్నారు, చెడ్డవాళ్ళూ ఉన్నారు. సోనాపూర్ పారిశ్రామిక కేంద్రం కాగానే "కుదువ" దుకాణాలు వచ్చాయి. జూదపు కొంపలు వచ్చాయి. సారా దుకాణం కూడా వెలిసింది.

సీతకు ఒక కొడుకు పుట్టాడు. రాముడి సంపాదన ఆ కుటుంబం సుఖంగా బతకటానికి సరిపోతున్నది. అయితే రాముడి చుట్టూ దుష్ట స్నేహితులు చేరారు. అతనికి వాళ్ళు తాగుడు అలవాటు చేశారు. అతని సాటి పనివారిలో హల

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



ధరుడు అనేవాడు తన ఖర్చుతో రాముడి చేత తాగించి, అలవాటు చేశాడు. ఆ తరవాత రాముడి సంపాదనతో ఇద్దరూ తాగసాగారు.

సీతకూ, కొడుక్కూ కడుపు నిండా తిండి లేకుండా పోయింది. పరిస్థితి రోజురోజుకూ విషమించసాగింది. రాముడు వారాంతంలో తన జీతం డబ్బులన్నీ సారా దుకాణంలో ఖర్చుచేసి, ఇంటికి తప్ప తాగి వచ్చేవాడు.

ఆకలితో బిడ్డ ఏడుస్తూంటే భరించలేక సీత ఒక మోతుబరి ఇంట్లో పైపనికి కుదురుకుని, తాను కూడా సంపాదించసాగింది. అయితే రాముడు భార్యను తిట్టి, చావగొట్టుతానని బెదిరించి, ఆమె నగలు కుదువబెట్టి, తన స్నేహితులతో కలిసి తాగేసేవాడు. ఒక్కొక్కసారి అతను సీతను అకారణంగా కొట్టేవాడు.

నిజానికి సారా దుకాణం మూలంగా సోనాపూరులో అన్ని కుటుంబాలూ అంతో ఇంతో అశాంతికి గురి కావటం జరిగింది. శ్రామిక కుటుంబ జీవనం నరకప్రాయమయింది. సీత ఈ బాధ భరించలేక ఒక రోజున కొడుకుతో సహా పుట్టింటికి వెళ్ళిపోయింది.

ఆమె తన పరిస్థితి అంతా తన అన్న అయిన హీరాదాసుకు రహస్యంగా చెప్పింది. వాళ్ళిద్దరూ ఈ సంగతి తమ తల్లిదండ్రులకు కూడా చెప్పలేదు. సీత చెప్పకుండా వచ్చినందుకూ, ఆమెతో బాటు రామదాసు రానందుకూ తండ్రి ఆశ్చర్యపడ్డాడు. తల్లి సీతను చూసి, ఆమె చిక్కిపోయినందుకు విచారించింది. తనకు ఒంట్లో అంత బాగాలేదనీ, విశ్రాంతి కోసమే వచ్చాననీ సీత తల్లితో అన్నది.

హీరాదాసు తన మిత్రుడైన రూపేశుడికి తన చెల్లెలి పరిస్థితి గురించి పూర్తిగా తెలియజేస్తూ ఉత్తరం రాశాడు. రూపేశుడు చాలా సూక్ష్మబుద్ధి గలవాడు. అతనికి కొంత ఇంద్రజాలం కూడా తెలుసు. అతను వారం రోజులలోగా

హీరాదాసు ఇంటికి వచ్చాడు. స్నేహితు లిద్దరూ కూర్చుని, రాముడి తాగుడు మాన్పించటానికి మంచి ఉపాయం ఆలో చించారు.

"ఉపాయమంటూ దొరకాలిగాని, మీ రామదాసునే కాదు, సోనాపూర్ శ్రామికులందరిచేతా తాగుడు మాన్పించనా?" అన్నాడు రూపేశుడు. అన్ని వ్యసనాలలోకీ తాగుడు మహా చెడ్డది. పేదవాళ్ళకు అది చేసే హాని ఇంతా, అంతా కాదని అతని ఉద్దేశం.

మూడు రోజులు గడిచేసరికి అతనికి ఒక ఉపాయం తట్టింది. అతను హీరాదాసు వెంట ఆ గ్రామంలో ఉండే తగరపు పనివాడి వగ్గిరికి వెళ్ళారు. ఆయన పేరు యదునాధుడు, మంగళదాసుకు మిత్రుడు.

"యదు, మామా, నా స్నేహితుడికి ఒక మాయవస్తువు అతి రహస్యంగా చేసి ఇయ్యాలి. అత్తకు కూడా చెప్ప రాదన్నమాట!" అన్నాడు హీరాదాసు.

"అంత రహస్యమైతే ఎందుకు చెబుతాను రా? ఇంతకూ ఏమిటా కావలసిన వస్తువు?" అన్నాడు యదు.

వాళ్ళకు కావలసినది గరాటీ. మామూలు గరాటీ కాదు, మాయ గరాటీ. ఒక గరాటీలో మరొక గరాటీ అతికించాలి. రెండో గరాటీ పైదానికన్న కాస్త చిన్నదిగా ఉంటుంది. కాని పై భాగంలో రెండూ ఒకే వ్యాసం కలిగి ఉంటాయి.






పై గరాటీ తోకలోకి లోపలి గరాటీ తోక అమరి ఉంటుంది. పైకి చూడటానికి ఒకే గరాటీలాగా కనిపించాలి. పై గరాటీ పై భాగంలో చిన్న బెజ్జం ఉండాలి.

ఈ మాయ గరాటీ తయారైన మీదట, రూపేశుడు దాని తోక కింద తన చూపుడు వేలు అడ్డం పెట్టి, దాని నిండా నీరు పోశాడు. తరవాత అతను బెజ్జానికి బొటనవేలు అడ్డంపెట్టి, తోకకు అడ్డంగా ఉన్న చూపుడువేలు తీసేశాడు. గరాటీ లోని నీరు కింద కారిపోయింది. బొటన వేలిని బెజ్జం మీది నుంచి తియ్యకుండానే అతను గరాటీ పైన ఉన్న తడి అంతా శుభ్రంగా తుడిచి, గరాటీని హీరాదాను పొట్ట సమీపంలో ఉంచి, "దగ్గు", అన్నాడు. హీరాదాను దగ్గాడు. వెంటనే గరాటీలో నుంచి మళ్ళీ నీరు కారింది.

"ఎలా ఉంది ట్రిక్కు?" అన్నాడతను.

"ఇంద్రజాలంగా బాగానే ఉన్నది. దీనితో తాగుబోతులను ఎలా మరమ్మతు చేస్తావు?" అన్నాడు హీరాదాను.

"తొందరపడకు. అంతా నువే చూస్తావు," అన్నాడు రూపేశుడు.

ఇది జరిగిన కొద్ది రోజులకు, సోనాపూర్ పంచదార ఫ్యాక్టరీ సమీపంలో మర్రిచెట్టు కింద ఒక ముసలి సాధువూ, ఆయన యువక శిష్యుడూ కూర్చున్నారు. త్వరలోనే వారి చుట్టూ జనం మూగి, సలహాలూ, మందులూ అడగసాగారు. ఒకడు తలనొప్పికి మందు అడిగాడు. సాధువు ఏదో పొడి ఇచ్చి, తన కమండలం లోని మంచినీళ్ళతో తాగించాడు. తల నొప్పి కొద్దిసేపట్లోనే పోయింది. ఆ మనిషి సాధువు కాళ్ళమీద పడ్డాడు, "స్వామీ, మీరు సాక్షాత్తూ భగవంతుడే!" అంటూ.

"నేను భగవంతుణ్ణి కాదు, నాయనా. కాని భగవంతుడు పంపగా వచ్చాను. ఇక్కడ ఈ కాలంలో ఇన్నిరకాల రోగాలు ప్రబలటానికి కారణం తెలుసా? తాగుడు. దాని మూలాన కడుపులో విషం పేరుకుని, రకరకాల రోగాలు కలిగిస్తుంది," అన్నాడు.

జనంలో కూర్చుని ఉన్న హలధరుడు ఈ మాట ఒప్పుకోక, "అదేమిటి? దేవతలు సోమరసం తాగేవారు. అది సారా కాదా?" అన్నాడు.

"సోమరసం సారా కాదు; మనం దేవతలమూ కాము." అన్నాడు సాధువు.

"సారావల్ల జబ్బేమీ లేదు. మేం కష్టపడి పనిచేస్తాం. తాగితే మనస్సుకు ఉల్లాసంగా ఉంటుంది." అన్నాడు హలధరుడు.

"నువు వెయ్యిచెప్పు. తాగుడు వల్ల రోగం వచ్చి తీరుతుంది. కావలిస్తే రుజువు చేస్తాను." అని సాధువు తలనొప్పి వచ్చిన వాణ్ణి దగ్గిరికి రమ్మని, తన శిష్యుడి సంచీ నుంచి ఒక గరాటీ పైకి తీసి, దాన్ని ఆ మనిషి పొట్టకు అనించి చిన్నగా దగ్గమన్నాడు. ఆ మనిషి దగ్గగానే గరాటీ తోకనుంచి నల్లని ద్రవం బయటికి వచ్చింది.

ఈ అద్భుతం చూసి అందరూ నిర్ఘాంతపోయారు.

"తాగే ప్రతివాడిలోనూ ఇలాటి విషం ఉంటుందని నిరూపించ గలను. ఇది ప్రాణాలు తీస్తుంది. దీని నుంచి బతికి బయటపడ గోరేవారికి నేను దివ్యమైన ఔషధం ఇచ్చి, ఈ విషాన్ని విరిచేస్తాను." అన్నాడు సాధువు.

మర్నాటి నుంచీ, సాధువులో గురి కుదిరిన వాళ్ళు వచ్చి, తాగుడు మానేస్తామని, దివ్యౌషధం తీసుకున్నారు. సాధువు



తాలూకు మనుషులు సారా దుకాణం మీద ఒక కన్ను ఉంచి, మందు పుచ్చుకున్నవారిలో ఎవరెవరు మళ్ళీ వెళ్ళి తాగారో గమచించారు. అలాటి వాళ్ళను సాధువు గరాటీతో పరీక్షించినప్పుడు దాని నుంచి నల్లనివిషం వచ్చింది; నిజంగా తాగటం మానేసిన వాళ్ళను పరీక్షిస్తే గరాటీ నుంచి స్వచ్ఛమైన నీరు వచ్చింది.

సాధువు ప్రారంభించిన ఈ ఉద్యమం ఎంత బాగా సాగిందంటే, సారా అమ్మకం అకస్మాత్తుగా పడిపోయింది. చాలా కుటుంబాలలో శాంతి, సౌఖ్యాలు మళ్ళీ నెలకొన్నాయి. మారిపోయిన వారిలో రామదాసు కూడా ఉన్నాడు. సీత వెళ్ళిపోయినాక అతను చాలా మనోవేదన అనుభవించి, చివరకు సాధువు శరణు జొచ్చాడు.

సారా వ్యాపారికీ, హలధరుడికీ సాధువు మీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. రెండు వారాలుగా సారా అమ్మకాలు లేవు. తాను లోగడ ఇద్దరిని హత్యచేసి పట్టుబడకుండా తప్పించుకున్నాననీ, ఈ సాధువును కూడా హత్య చేస్తాననీ హలధరుడు సారా వ్యాపారితో అన్నాడు.

దుకాణం నౌకరు ఇది విని, వెళ్ళి సాధువుకూ, పోలీసులకూ కూడా చెప్పాడు. ఆ రాత్రి హలధరుడు సాధువును చంపటానికి వచ్చినప్పుడు సాధువు పడుకుని ఉండవలిసిన చోట గుడ్డలమూట మీద దుప్పటి కప్పి ఉండటమేగాక, హలధరుడు పోలీసులకు కత్తితో సహా దొరికిపోయాడు. హలధరుడు పాతనేరస్థుడనీ, వాడు రంజిత్, కాలూ అనే పేర్లతో కూడా తిరిగాడనీ బయటపడింది.

సాధువు రూపేశుడు. అతను మొత్తం మీద సోనాపూర్ ఫ్యాక్టరీ పరిసరాలలో తాగుడు లేకుండా చేశాడు. రామదాసు తన అత్తవారి ఊరు వెళ్ళి, సీతకు క్షమాపణ చెప్పుకున్నాడు. తరవాత వాళ్ళ సంసారంలో ఎలాటి ఛిద్రమూ తలఎత్తలేదు.



# 178. అమెరికాలో హానిమన్ విగ్రహం

వాషింగ్టన్ లోని ప్రముఖవీధిలో, డానియల్ వెబ్‌స్టర్ కాంస్య విగ్రహానికి ఎదురుగా శామ్యూల్ క్రిష్టియన్ ఫ్రెడరిక్ హనిమన్ విగ్రహం ఉన్నది. ఈయన హెూమియోపతీ చికిత్సా విధానాన్ని కనిపెట్టినవాడు.





# చిల్లర దొంగ

ఒక ఊళ్ళో ఒక షావుకారు ఉండేవాడు. ఆయనకు పిల్లా, జెల్లా లేరు. భార్య రోగిష్ఠిది. షావుకారు వద్ద పనిచేసే నాంచారయ్యే ఇంటి పనీ, బయట పనీ కూడా తానే చేసేవాడు. నాంచారయ్య నమ్మకస్థుడు. అందుచేత షావుకారు తన ఇంటి ఖర్చుకు ఇచ్చిన డబ్బుకు నాంచారయ్యను లెక్క కూడా అడిగే వాడు కాడు.

ఒకసారి నాంచారయ్యకు జబ్బు చేసింది. అందుచేత నాంచారయ్య తనకు బదులు తన కొడుకు రాముణ్ణి షావుకారు వద్ద పనికి పంపాడు.

తండ్రిలాగే రాముడు కూడా పనులు చక్కగా చేసేవాడు, కాని చిల్లరడబ్బులు కాజేసే దుర్గుణం వాడిలో ఉండేది. వాడు వెచ్చాలు తీసుకురావటానికి వెళ్ళినప్పుడల్లా కొంత చిల్లర తన జేబులో వేసుకునే వాడు, దానితో వాడి పై ఖర్చులు గడిచేవి. షావుకారు మొదట్లో ఇది గమనించలేదు. కాని ఒక నెల గడిచేసరికి ఇంటి ఖర్చులో కొంత పెరుగుదల కనిపించింది. నాంచారయ్య ఉన్నప్పుడు ఇంత ఖర్చు కాలేదు. షావుకారుకు అనుమానం కలిగి, ఆయన రాముణ్ణి వస్తువుల ధరలు అడగనారంభించాడు. రాముడు ఆ ధరలు పావలా, అర్ధా పెంచి చెప్పి, తాను జేబులో వేసుకున్న చిల్లరకు కూడా లెక్క కుదిరేటట్టు చెప్పేవాడు.

షావుకారుకు అనుమానం తీరలేదు. ఆయన కావలసిన వస్తువుల జాబితా స్వయంగా రాసి, అంగడివాళ్ళచేత వాటి ధరలు వేయించుకు రమ్మన్నాడు. రాముడు ఆ కాగితాన్ని చించి పారేసి, దానికోసం వెతికినట్టు నటించి, చివరకు అది ఎక్కడో పోయిందన్నాడు.

గవ్వల నిర్మలాదేవి

రాముడు చిల్లర కాజేస్తున్నట్టు షావుకారుకు రూఢి అయింది. వాడి దొంగతనం రుజువు చెయ్యాలన్నా, వాణ్ణి పనిలో నుంచి తీసెయ్యాలన్నా షావుకారు చేతిలో పనే. కాని అలాచెయ్యటం షావుకారుకు ఇష్టంలేదు. వాడు నాంచారయ్య కొడుకు. నాంచారయ్య ఏళ్ళతరబడి షావుకారు వద్ద నమ్మకంగా పనిచేసినవాడు. నాంచారయ్య మంచాన పడినప్పటినుంచీ, అతని వైద్యానికి షావుకారు తానే డబ్బు ఇస్తున్నాడు. అందుచేత షావుకారు, రాముడి పట్ల కఠినంగా ప్రవర్తించకుండానే వాణ్ణి మార్చాలనుకున్నాడు.

షావుకారులో మతిమరుపు లక్షణాలు రాముడికి కనిపించసాగాయి. ఒకసారి ఆయన రాముణ్ణి పిలిచి, గదిలో వంకెన తగిలించి ఉన్న తన ఉత్తరీయం పట్టుకు రమ్మన్నాడు.

రాముడు షావుకారును ఆశ్చర్యంగా చూసి, ''ఉత్తరీయం మీ భుజం మీదే ఉన్నది గదండీ!'' అన్నాడు.

మరోసారి షావుకారు రాముడితో, "బల్ల మీద పెట్టాను, కళ్ళజోడు పట్రారా!" అన్నాడు.

కాని బల్ల మీద కళ్ళజోడు లేదు. ఎంతోసేపు వెతకగా అది బీరువాలో కనిపించింది.

''బల్లమీద ఉన్న కళ్లజోడు బీరువాలో ఎందుకు పెట్టావు?'' అని ఆయన రాముణ్ణి మందలించాడు. ఆయన మతి



మరుపు రానురాను రాముడి ప్రాణం మీదికి వచ్చింది.

ఒకరోజు ఆయన రాముడికి ఏయే సరుకులు ఎంతెంత కావాలో చెప్పి, డబ్బు ఇచ్చి దుకాణానికి పంపాడు. రాముడు ఆయన చెప్పిన ప్రకారమే దుకాణంలో సరుకులు కొని, మరొకసారి సరి చూసు కుని, పట్టుకొచ్చాడు.

షావుకారు వాటిని చూసి, "ఇదేమిట్రా? నేను చెప్పినట్టు తీసుకురాక, అన్నీ ఎక్కువ తెచ్చావేం? కందిపప్పు శేరు తెమ్మంటే రెండు శేర్లు తెచ్చావు. ఉల్లి పాయలు వీశెడు తెమ్మంటే రెండు వీశెలు తెచ్చావు. గుమ్మడికాయ తెమ్మంటే పొట్ల కాయ తెచ్చావు. కాస్త ఒళ్ళు దగ్గిర పెట్టుకు పనిచెయ్యి మరి. హెచ్చు తెచ్చిన వన్నీ ఇచ్చేసి డబ్బులు పట్టుకురా!" అన్నాడు.

"బాబూ, మీరు తెమ్మన్నట్టే తెచ్చాను." అని రాముడు చెప్పబోతే, "మతిమరుపు వెధవా! నన్నే బుకాయిస్తావా? వెళ్ళి సరుకులిచ్చి డబ్బు తీసుకురా!" అన్నాడు షావుకారు.

యజమాని మతిమరుపును తిట్టు కుంటూ రాముడు కొందరు వర్తకులకు సరుకులు వాపసు చేసి, డబ్బులు తీసు కున్నాడు. మరికొందరు సరుకులు వాపసు తీసుకోలేదు. వాటికి డబ్బులు రాముడు తన జేబులో నుంచి షావుకారుకు ఇచ్చుకోవలసి వచ్చింది.

ఇలా రెండు మూడు సార్లు జరిగేసరికి రాముడికి దడ పుట్టుకొచ్చింది. వాడు తన యజమాని చేత జాబితా రాయించుకుని, అంగడికి వెళ్ళి, వస్తువులు కొని, వాటి ఖరీదులు ఆ జాబితా మీదనే రాయించు కుని, ఆ జాబితా తెచ్చి యజమాని ముందు సరుకులతో పాటు పెట్టటం అలవాటు చేసుకున్నాడు. షావుకారు మతిమరుపును ఎదుర్కోవటానికి అంతకన్న మరో పద్ధతి లేదు. కాని రాముడి చిల్లర దొంగతనాలు అరికట్టటానికి కూడా అదే మంచిమార్గంగా షావుకారుకు ఉపయోగపడింది.



# సాక్ష్యం

ఒక వర్తకుడి ఇంట అర్ధరాత్రి దొంగపడి ఇల్లు దోచుకున్నాడు. కొన్ని ఆధారాలను బట్టి వర్తకుడు దొంగను పోల్చిపట్టుకుని, న్యాయాధికారి వద్దకు తీసుకుపోయి ఫిర్యాదు చేశాడు.

"ఇతడే నీ ఇంట్లో ప్రవేశించి, దొంగతనం చేశాడనటానికి తగిన సాక్ష్యం ఉందా?" అని న్యాయాధికారి వర్తకుణ్ణి అడిగాడు.

ప్రత్యక్షసాక్ష్యం ఏదీ లేదని చెప్పాడు వర్తకుడు.

దొంగతనం చేస్తూండగా చూసినవారి సాక్ష్యం లేని పక్షంలో ఫిర్యాదు నిలబడదన్నాడు న్యాయాధికారి.

వెంటనే వర్తకుడు తన కాలి చెప్పు తీసి, దొంగగా అనుమానించిన మనిషిని న్యాయాధికారి ఎదటే కొట్టాడు.

"అదేమిటి, అలా కొడుతున్నావు?" అన్నాడు న్యాయాధికారి ఆశ్చర్యపోతూ.

"నా ఇంట్లో ఫలానాఅప్పుడు దొంగతనం చేయదలచినట్టు వీడు నాకు ముందుగా తెలియజేయలేదు. అందుచేత నేను సమయానికి సాక్షులను సిద్ధంగా ఉంచుకోలేకపోయాను. నాకా అవకాశం ఇయ్యనందుకు వాణ్ణి కొట్టాను," అన్నాడు వర్తకుడు. —"ప్రసాద్"





# అభిమానుల సన్మానం

చంద్రగిరి ఏలే కమలవర్మ కళా పోషకుడు. ఆయన ఆస్థానంలో కవులూ, గాయకులూ, నర్తకులూ, నటులూ ఉండే వారు. ప్రతిరోజూ సాహిత్య గోష్ఠి జరిగేది. అందులో కవులూ, పండితులూ పాల్గొనే వారు. చాలామంది ప్రజలు వచ్చి ఆ గోష్ఠులు చూసి ఆనందించేవాళ్ళు. ఆ కవులకు అభిమానులుండేవారు.

తన ఆస్థానంలోని కవి పండితులలో ఎవరికి ప్రజలలో ఎక్కువ ఆదరమున్నదో తెలుసుకోవాలని కమలవర్మకు అనిపించింది. అందుకు ఆయన మంత్రిని సలహా అడిగాడు. కవులను దేశసంచారం చేసి ప్రదర్శనలు ఇయ్యనియ్యమనీ, ప్రజలు తమకు తోచిన విధంగా కవులను సన్మానించి బిరుదప్రదానాలు చేయవచ్చునని ప్రకటించమనీ మంత్రి రాజుకు సలహా ఇచ్చాడు. రాజు అలాగే చేశాడు.

కమలవర్మ ఆస్థానంలో చెప్పుకోదగ్గ కవులు నలుగురున్నారు. వాళ్ళ పేర్లు నందకుమారుడూ, అక్షయశర్మా, కృష్ణ శాస్త్రీ, వనమోహనుడూ. వీళ్ళకు దేశంలో ఎందరో అభిమానులున్నారు. తమ అభిమాన కవులు దేశ సంచారం చేస్తున్నందుకు వాళ్ళు చాలా సంతోషించారు. వాళ్లు తమ అభిమాన కవులను సన్మానించడానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేశారు. ఉత్తర ప్రాంతంలో నందకుమారుడికీ, దక్షిణ ప్రాంతంలో అక్షయశర్మకూ, పూర్వ భాగంలో కృష్ణశాస్త్రికీ, పశ్చిమ భాగంలో వనమోహనుడికీ భారీ సన్మానాలు జరిగాయి. అందుకు వేరే కారణమేమీ లేదు. వారి వారి జన్మస్థలాలు ఆయా ప్రాంతాలలో ఉన్నాయి. ఎవరి ప్రాంతంలో వారికి కనకాభిషేకమూ, బిరుదులూ లభించాయి. నందకుమారుడికి కవిసార్వ

"వసుంధర"

భౌముడనీ, అక్షయశర్మకు కవిసమ్రాట్టు అనీ, కృష్ణశాస్త్రికి కవిచక్రవర్తి అనీ, వనమోహనుడికి కవిరాజరాజనీ బిరుదులు లభించాయి

దేశం మిగతా ప్రాంతాల సంచారం చేసినప్పుడు కవులకు చెప్పుకోదగ్గ ఆదరణ లభించలేదు. కొన్నిచోట్ల కొన్ని సన్మాన సభలలో అలజడి కూడా సాగింది. దేశ సంచారం పూర్తి చేసుకుని కవులు రాజధానికి తిరిగి వచ్చారు.

రాజు వారి అనుభవాలన్నీ ఎంతో శ్రద్ధగా విన్నాడు, కాని ఆయన సందేహం తీరలేదు. అందరు కవులకూ సమంగా సన్మానాలూ, బిరుదులూ, అనాదరణా కూడా లభించాయి. తన ఆస్థానంలోని నలుగురు కవులలో ఎవరు ఎక్కువగా ప్రజాభిమానం చూరగొన్నదీ రాజుకు తెలియనేలేదు.

ఆయన మళ్ళీ మంత్రితో, "మన నలుగురు కవులలో ఎవరిమీద ప్రజలకు ఎక్కువ అభిమానమున్నదీ తెలుసుకు వస్తే, ఎక్కువ ప్రజాభిమానం గల కవిని ఆస్థానకవి చేద్దామనుకుంటున్నాను," అన్నాడు.

మంత్రి తాను కూడా దేశసంచారం చేసి కవులను గురించి కొంత సమాచారం సంపాదించాడు. దేశంలో ప్రతి కవికీ




కొందరు అభిమానులున్నారు. వారు ఆ కవి రచనలను అభిమానించటంతో ఆగక, మిగిలిన కవుల రచనలను ద్వేషిస్తారు. నలుగురు కవులకూ దేశంలో అభిమానుల సంఖ్య ఇంచుమించు సమంగానే ఉన్నది.

మంత్రికి ఏం చెయ్యాలో పాలుపోలేదు. నలుగురిలో ఎవరో ఒకడు గొప్పవాడని తాను నిరూపించకపోతే రాజు ఊరుకోడు. ఎవరిని తాను ఆస్థానకవిగా శిఫార్సు చేసినా, దేశంలో మూడు వంతుల మంది తనను బ్రతకనియ్యరు.

ఆయన ఎంతో నిరుత్సాహంతో రాజధానికి తిరిగి వచ్చాడు. ఆయన ఇల్లు

చేరుకునేసరికి, ఆయన కూతురు తొలి ప్రసవానికి వచ్చి, పండంటి కొడుకును కన్నది. ఆమె తన కొడుకును ముద్దులాడుతూ, "నా బంగారు తండ్రి! వరహాల కొండ! నా రాజా!" అనటం మంత్రి విన్నాడు.

ఆ మాటలు వినగానే ఆయనకు ఏదో స్ఫురించి, మనసు తేలికపడింది. ఆయన స్నానపానాలు ముగించుకుని, రాజును చూడబోయాడు.

"తెలుసుకున్నారా?" అని కమలవర్మ మంత్రిని అడిగాడు.

మంత్రి నవ్వి, "మహారాజా, బిడ్డను కన్న ప్రతి తల్లీ తన కొడుకు ఒక రాజే అనుకుంటూ ముద్దులాడుతుంది. కాని ఆమె నిజంగా అలా నమ్ముతుందంటారా?" అని అడిగాడు.

"అంత మూర్ఖులుంటారనుకోను," అన్నాడు రాజు.

"మన ప్రజల్లో దురభిమానం తప్ప, నిజమైన సాహిత్యాభిలాష లేదు, మహారాజా. వాళ్ళు కవులకిచ్చిన బిరుదులు కవుల శక్తి సామర్థ్యాలను చూసి కాదు, తమ అభిమానాలనుబట్టి. తమ అభిమాన కవి కన్న మరొకడికి పెద్ద బిరుదు రాకూడదని, కవిసార్వభౌముడూ, కవి సమ్రాట్, కవిచక్రవర్తీ, కవిరాజరాజూ లాటి బిరుదులిచ్చారు ప్రజలు తమ అభిమాన కవులకు," అన్నాడు మంత్రి.

"అయితే ఆస్థానకవిని ఎన్నుకోవటం ఎలా?" అని రాజు అడిగాడు.

"కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్ట దిగ్గజాలుండేవారట. ఆయనకూ కూడా ఇటువంటి ఇబ్బందే వచ్చిందేమో. మీరు కూడా మన నలుగురు కవులనూ బ్రహ్మదేవుడి నాలుగు ముఖాలని ప్రకటించి, సమాన హోదా ఇయ్యండి. ఏ ఇబ్బందీ రాదు," అన్నాడు మంత్రి.

కమలవర్మ మంత్రి చెప్పినట్టే చేసి, దేశంలో ప్రాంతీయ దురభిమానాలు తగ్గించడం కోసం ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఆ ప్రయత్నాలు ఫలించాయి.





# చెడుమార్గం

పూర్వం ఒక గ్రామంలో సోమయ్య అనే ఒక యువకుడు ఉండేవాడు. వాడు కూలిపని చేసుకుని జీవిస్తూ ఉండేవాడు. పగలంతా కష్టపడి పనులు చేసి, అలా సంపాదించిన కూలి డబ్బులతో ఏపూట కాపూట పొట్ట నింపుకుంటూ, రాత్రిపూట సత్రంలో పడుకునేవాడు.

అదే సత్రంలో కొందరు బిచ్చగాళ్ళు కూడా రాత్రివేళ పడుకునే వాళ్ళు. సోమయ్యకు వాళ్ళతో బాగా పరిచయమయింది. వాళ్ళతో కబుర్లు చెప్పుకుంటూ ఉండటంలో సోమయ్యకు ఒక విషయం స్పష్టమయింది. అదేమిటంటే, ఆ బిచ్చగాళ్ళు తనలాగా శరీరశ్రమ ఏమీ పడకుండానే తన కన్న ఎక్కువ సుఖంగా బతుకుతున్నారు!

తాను మాత్రం బిచ్చగాడుగా జీవిస్తూ ఎందుకు సుఖపడగూడదని సోమయ్యకు తోచింది. వాడు కూలిపని మానేసి, బిచ్చమెత్తసాగాడు. అలా కొంతకాలం జరిగింది.

ఒక రోజు రాత్రి సత్రం అరుగు మీద పడుకుని ఉన్న సోమయ్య ఒక రాత్రివేళ మేలుకున్నాడు. పక్క గదిలో ఎవరో మాట్లాడుకోవటం వాడికి వినిపించింది. సోమయ్య ఆ గదిని సమీపించి, లోపల జరిగే సంభాషణను ఆలకించాడు.

లోపల ఇద్దరు వ్యక్తులు డబ్బులూ, నగలూ పంచుకుంటున్నారు. వాళ్ళ మాటలను బట్టి, వాళ్ళు మరో ఆరునెలల పాటు హాయిగా కాలిమీద కాలువేసుకుని, ఆ ధనంతో సుఖంగా బతకబోతున్నారని తెలిసింది. వాళ్ళు ఆ ధనమూ, నగలూ దొంగతనం చేశారని కూడా సోమయ్య గ్రహించాడు.

సోమయ్య బుర్రలో మరో ఆలోచన మెదిలింది. కూలిపని కంటె బిచ్చం

కోలార్ కృష్ణఅయ్యర్

ఎత్తటం హాయిగా ఉన్నమాట నిజమేగాని, దొంగతనం చేసి జీవించటం మరింత హాయిగా ఉన్నట్టు కనబడింది. బిచ్చమెత్తటానికైనా పది ఇళ్ళ ముందు నిలబడి, గొంతు చించుకుని అరవాలి. ఏ పూట తిరగటానికి బద్ధకించినా ఆ పూట పస్తు పడుకోవాలి. దొంగతనం అలాకాదు; ఒకపూట కష్టపడితే ఆరు నెలలపాటు హాయిగా గడపవచ్చు. దొంగతనం వృత్తిగా చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు సోమయ్య.

చోరవృత్తి కొంత కాలంపాటు అనుకూలంగానే సాగింది. తృప్తి అనేది లేకపోవటంచేత సోమయ్య, ఎక్కువ సంపాదించాలన్న దురాశతో దొంగతనాలు అమితంగా చేసి, చివరకు పట్టుపడ్డాడు. వాణ్ణి పట్టుకున్నవాళ్ళు చావ చితకగొట్టి, పోలీసులకు అప్ప జెప్పారు. వాడికి ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్షపడింది.

శిక్ష పూర్తిగా అనుభవించి, కళ్ళు తెరుపుడుపడి, సోమయ్య తన గ్రామానికి తిరిగి వచ్చి, మళ్ళీ బిచ్చం ఎత్త యత్నించాడు. కాని ఊళ్ళో వాళ్ళు వాణ్ణి చూడగానే, "దొంగ వెధవా, మళ్ళీ వచ్చావా? రాత్రి ఏ ఇంటికి కన్నం వేద్దామని చూస్తున్నావు?" అని చీదరించుకుంటూ వాణ్ణి తరిమేశారు. వాడికి ఒక్క మెతుకైనా దొరకలేదు.

బిచ్చం ఎత్తటం గిట్టుబాటు కాదనుకుని, వాడు తిరిగి కూలిపనులు చేసి జీవించటానికి సిద్ధపడ్డాడు. కాని వాణ్ణి ఎవరూ కూలి పనికి కూడా పెట్టుకోలేదు. "దొంగ వెధవని ఎవరైనా దగ్గిరికి చేరుస్తారా? ఛీ, పో!" అన్నారు.

సోమయ్యకు ఒక సత్యం తెలిసివచ్చింది. మంచి మార్గం నుంచి చెడ్డ మార్గానికి వెళ్ళటం తేలికేగాని, చెడ్డ మార్గం నుంచి మంచి మార్గానికి రావటం చాలా కష్టం. అందుచేత వాడు తాను పుట్టి పెరిగిన గ్రామం వదిలిపెట్టి, కాయకష్టం చేసుకుని బతకటానికి మరో దూర గ్రామం వెళ్ళిపోయాడు.





# తీరిన కోరిక

ఆదిశేషయ్యా, ప్రసూనాంబలకు అనంతుడు ఒక్కడే సంతానం. అతను అందగాడూ, బుద్ధిమంతుడూనూ. పై పెచ్చు అతను పట్నంలో ఉద్యోగం చేస్తున్నాడు.

ప్రసూనాంబకు నగల పిచ్చి. ఒంటి నిండా నగలు ఉన్నప్పటికీ, వడ్డాణం చేయించుకోవాలన్న కోరిక మిగిలి పోయింది. వడ్డాణం కోసం ఆమె అడిగితే, ఆదిశేషయ్య, "ఇంకానయం, ఊరి మధ్య ఉన్న మర్రిచెట్టుకు చేయించ మన్నావు కావు!" అనేవాడు.

ప్రసూనాంబ స్థూలంగా ఉండే మాట నిజమే. తన భర్త ఎలాగూ తనకు వడ్డాణం చేయించడని గ్రహించి, "అబ్బాయి తెచ్చే కట్నం డబ్బుతో వడ్డాణం చేయించు కుంటాను. దాని మీద ఎవరూ చెయ్యి వెయ్యటానికి వీల్లేదు," అని ఖచ్చితంగా చెప్పేసింది.

అనంతుడు ఉద్యోగ రీత్యా రోజూ పట్నం వెళ్ళి వస్తూండేవాడు. పట్నం పొలిమేరల్లో ఒక పాత పెంకుటింట్లో ఉండే ఒక అందమైన అమ్మాయి రోజూ అతన్ని చూస్తూండేది. అయితే అతనికి ఆ సంగతి తెలీదు.

ఒకనాటి సాయంకాలం అతను ఇంటికి బయలుదేరుతూండగా వాన వచ్చింది. అతను కొద్దిగా తడిసి, ఆ పాతపెంకుటింటి పంచన తల దాచుకున్నాడు.

ఇంతలో ఇంట్లోనుంచి ఆ అమ్మాయి వచ్చి, అతను తల తుడుచుకునేటందుకు తువాలు ఇచ్చి, తాగటానికి వేడివేడి పాలు ఇచ్చింది. ఆ క్షణం నుంచీ ఆ పిల్ల అనంతుణ్ణి బలంగా ఆకర్షించింది. ఆమె పేరు రూప అనీ, ఆమె తండ్రి వడ్రంగం పని చేస్తాడనీ, వాళ్లు చాలా బీదవాళ్లనీ అనంతుడు తెలుసుకున్నాడు.

ఎం. కామేశ్వరరావు



తరవాత ప్రతిరోజూ వాళ్ళిద్దరూ కలుసుకుని, చీకటిపడినదాకా మాట్లాడుకునేవారు. ఇద్దరూ మనస్ఫూర్తిగా ఒకరినొకరు ప్రేమించుకున్నారు.

"మన పెళ్ళి సంగతి ఆలోచించు. కాని, మా నాన్న కానీ కట్నం ఇయ్యలేడు," అన్నది రూప.

"కట్నం ప్రసక్తి దేనికి? పెళ్లి విషయం ఇవాళే మా అమ్మా, నాన్నలతో మాట్లాడతాను," అన్నాడు అనంతుడు.

అతను తన తల్లిదండ్రులతో రూప సంగతి ఉన్నది ఉన్నట్టు చెప్పేశాడు.

"నీ కిష్టమైతే నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు ఆదిశేషయ్య.

కాని ప్రసూనాంబ మటుకు ఇంత ఎత్తున లేచి, "ఎన్నడూ లేనిది ప్రేమా, పెళ్ళి అంటూ పైత్యపు మాటలొస్తున్నాయి. నా నడుముకు వడ్డాణం ఏర్పాటయే షరతు మీదనే ఈ పెళ్ళి జరగాలి," అన్నది కచ్చితంగా.

"రూప తండ్రి కట్నం ఏమీ ఇచ్చుకోలేడు," అన్నాడు అనంతుడు.

"ముత్యంలాంటి అల్లుణ్ణి తేరగా తెచ్చుకుందామనుకుంటున్నాడేం? ఈ ఆటలు నా దగ్గిర సాగవు," అన్నది ప్రసూనాంబ. అనంతుడు గుడ్లు ఎర్ర జేసుకుని, వీధిలోకి వెళ్ళిపోయాడు.

"ఒరేయ్, ఆగరా!" అంటూ అతని వెనకాలే వెళ్ళిన ఆదిశేషయ్య చీకటి పడ్డాక ఇంటికి తిరిగివచ్చి, "వాడెక్కడా కనిపించలేదు. అయినా వాడు అంతగా ముచ్చటపడుతుంటే పెళ్ళికి ఒప్పుకోకూడదూ? ముసలిదానివి, ఇంకా నీకు నగలమీద తాపత్రయం ఎందుకు చెప్పు!" అంటూ భార్యని కేకవేశాడు.

"నేను ముసలిదాన్నా? ఇంకా యాభై అయినా నిండలేదు. పెళ్ళయి ముప్ఫై ఏళ్ళు దాటినా పెళ్ళానికో వడ్డాణం చేయించిపెట్టే సామర్థ్యం నీకు లేకపోగా, కొడుకు ద్వారా చేయించుకుందామన్నా కుళ్ళుతున్నావు," అన్నది ప్రసూనాంబ.

ఆ రాత్రి భార్యాభర్తలిద్దరూ భోజనాలు చేశారు. ప్రసూనాంబ వంటిల్లు సర్దుతూండగా బయటినుంచి, "పంతులూ, పంతులూ!" అన్న కేక వినిపించింది.

ఆదిశేషయ్య తండ్రిని 'పంతులు' అని పిలిచేవాళ్ళు. ఆయన పోయి ఆరేళ్ళయింది.

"ఎవరూ?" అంటూ ఆదిశేషయ్యా, ప్రసూనాంబా బయటికి వచ్చారు.

బయట ఒక ఖరీదైన గుర్రపు బండి ఆగి ఉన్నది. దానికి పట్టుతెరలు కట్టి ఉన్నాయి. అందులోనుంచి ఒక ముసలాయన దిగాడు. ఆయన కట్టిన బట్టలు చాలా ఖరీదైనవి. ఆయన పది వేళ్ళకూ ధగధగా మెరిసే ఉంగరాలున్నాయి.

"పంతులుగారు పోయి ఆరేళ్ళయిందండీ. ఆయన మా నాన్నగారు." అన్నాడు ఆదిశేషయ్య ఆ ముసలాయనతో.

"ఆఁ? ఆయన పోయాడా?" అని ముసలాయన అరుగుమీద కూలబడి, కళ్ళు ఒత్తుకున్నాడు.

"మీకు మా నాన్నగారు ఏ విధంగా తెలుసు?" అని ఆదిశేషయ్య ఆయన నడిగాడు.

"ఆయనా, నేనూ బాల్యమిత్రులం. పెళ్ళిళ్ళయేదాకా ఇద్దరమూ కలిసి తిరిగాం. ఇద్దరమూ వియ్యం అందుదా



మని కలలు కన్నాం. కాని ఇద్దరికీ కొడుకులే కలగటం చేత అది సాధ్యం కాలేదు. నేను వ్యాపారం నిమిత్తం విదేశాలకు వెళ్ళి, బోలెడంత ఆస్తి సంపాదించాను. నా కొడుక్కు ఒక కూతురూ పంతులుకు ఒక మనమడూ ఉన్నట్టు తెలిసింది. అందుచేత విదేశాల నుంచి తిరిగివస్తూనే రెక్కలు కట్టుకుని ఎంతో ఆశతో వచ్చాను. నా ఆశ నిరాశ అయింది. మరి వెళతాను." అని ముసలాయన లేచాడు.

"ఉండండి, బాబాయిగారూ. మామగారు కూడా కన్ను మూసే ముందు నాకీ సంగతే చెప్పారు. ఈ పెళ్ళి జరిగితేనే

గాని ఆయన ఆత్మ శాంతించదు. అందుకే మా అబ్బాయికి ఇంతకాలం పెళ్ళి చేయలేదు. అబ్బాయి పనిమీద పట్నం వెళ్లాడు, ఉదయం వస్తాడు. ఈ పూటకి ఇక్కడే ఉండండి,'' అన్నది ప్రసూనాంబ ముసలాయనతో.

ఆమె వెంటనే మళ్ళీ వంటకు ఉపక్రమించింది. ఆదిశేషయ్య వంటగదిలోకి వచ్చి, ''ఆ ముసలాయనకు అన్ని అబద్ధాలు కల్పించి చెప్పావు, దేనికి?'' అని కోపంగా అడిగాడు.

''లక్ష్మీదేవి ఇల్లు వెతుక్కుంటూ వస్తే గెంటేస్తామేమిటి? ఈ పెళ్ళి చేస్తే పిల్లాడు సుఖపడతాడు,'' అన్నదామె.

''పిల్లవాడి మాట ఎలా ఉన్నా, నువు ఏకంగా నాలుగు వడ్డాణాలు చేయించుకోవచ్చు,'' అని వెటకారంగా అన్నాడు ఆదిశేషయ్య.

ప్రసూనాంబ మర్నాడు లేస్తూనే గొల్లుమన్నది. ఆమె నగలపెట్టె బద్దలు కొట్టి ఉన్నది. అందులో ఒక్క నగ కూడా లేదు.

రాత్రి వచ్చిన ముసలాయన జాడ కూడా లేదు.

''ప్రేమించుకున్న వాళ్ళను విడదీద్దామనుకున్నందుకు నీకు తగిన శాస్తే జరిగిందిలే!'' అన్నాడు ఆదిశేషయ్య.

కాస్సేపటికి అనంతుడు వచ్చి, ''రూప తండ్రి వేరే కట్నం ఇయ్యలేకపోయినా తన భార్య తాలుకు వడ్డాణం ఇస్తాడట,'' అన్నాడు.

నగలన్నీ పోయిన దుఃఖంలో వడ్డాణం మాట వినపడగానే ప్రాణం లేచివచ్చి, ప్రసూనాంబ పెళ్ళికి ఒప్పుకున్నది.

పెళ్ళిలో రూప తండ్రిని ఎక్కడో చూసినట్టు ప్రసూనాంబకు అనిపించింది గాని, అనంతుడూ, ఆదిశేషయ్యా, రూప తండ్రీ కలిసి, అద్దె బండితోనూ, అరువు దుస్తులతోనూ, గిల్టు ఉంగరాలతోనూ నాటకం ఆడారనీ, తన నగలనే కరిగించి వడ్డాణం చేయించారనీ ఆమె ఎరగదు.

ఏమైనా వడ్డాణం పెట్టుకోవాలని ఎన్ని ఏళ్లుగానో ఉన్న ఆమె కోరిక తీరిపోయింది.





# అత్తకు తగిన కోడలు

రమణమ్మ పిసినారిది. భర్త పోయాడు. అంతో ఇంతో ఆస్తి ఉన్నది. కొడుకు సత్యం ఉద్యోగం చేసి సంపాదిస్తున్నాడు. అయినా రమణమ్మ వడియాలూ, అప్పడాలూ, ఆవకాయా తయారుచేసి అమ్మేది. సంపాదించిన డబ్బు భద్రంగా ఇనప్పెట్టెలో దాచుకునేది. పోగైన చిల్లర డబ్బులు ఖాళీ అగ్గిపెట్టెలలో దాచుకునేది.

సత్యం అందంగానే ఉంటాడు. తల్లికి ఎదురు చెప్పలేడు. రమణమ్మ వాడికి ఇంకా పెళ్ళి చెయ్యలేదు.

"కావలసినంత డబ్బున్నది. ఇంకా ఎంతకాలం కష్టపడతావు? సత్యానికి పెళ్ళిచేసి, కోడల్ని తెచ్చుకుని సుఖపడ రాదూ?" అన్నారు ఇరుగు పొరుగు అమ్మలక్కలు.

"చేస్తానమ్మా, చేస్తాను. తగిన కోడలు పిల్ల దొరకవద్దూ?" అన్నది రమణమ్మ.

తగిన కోడలు అంటే ఆమె ఉద్దేశంలో తన కొడుకుకన్నా అసమర్థురాలూ, నోరు లేనిదీ!

ఒకరోజున ఆమె పెళ్ళిళ్ళ పేరయ్యను పిలిపించి, "ఎక్కడైనా నా కొడుక్కు మంచి సంబంధం చూడు. పిల్ల నా చెప్పు చేతలలో ఉండాలి. కట్నం భారీగా కావాలి," అన్నది.

"అలాగే చూస్తాను. నిప్పులు చెరిగే ఎండలో పడి నడిచి వచ్చాను. చల్లగా తాగటానికి ఏదన్నా ఇయ్యి." అన్నాడు పేరయ్య.

రమణమ్మ ఏ మజ్జిగ తేటో, చక్కెర నీళ్ళో తెస్తుందని పేరయ్య ఆశపడ్డాడు, కాని ఆమె గ్లాసుడు మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చింది.

"మరి నాకు దక్షిణ ఇప్పిస్తావా?" అన్నాడు పేరయ్య.

కాండూరి భార్గవి



"దక్షిణమా? ఇటె వెళ్ళు." అని రమణమ్మ పెళ్ళిళ్ళ పేరయ్యకు దొడ్డి దారి చూపింది.

కొన్నాళ్ళ అనంతరం పేరయ్య ఒక సంబంధం తెచ్చాడు. పిల్ల రమణమ్మకు నచ్చింది. ఆ పిల్లకూ, సత్యానికి పెళ్లి జరిగింది. అమ్మలక్కలు రమణమ్మ కొత్త కోడలిని చూడవచ్చారు. అదే సమయంలో పెళ్లిళ్ల పేరయ్య తన కట్నం పుచ్చుకునేటందుకు వచ్చాడు. అందరి ఎదటా తన పెద్దరికం ప్రదర్శించాలని, రమణమ్మ కోడలితో, "అమ్మాయ్. పేరయ్యకు ఫలహారంతోబాటు, తాంబూలంలో పదో, పరకో ఇయ్యి." అన్నది.

కోడలు లోపలికి వెళ్ళి, పెద్ద పళ్ళెం నిండా పాతిక లడ్డూలు, పాతిక కజ్జికాయలూ, ఇతర ఫలహారాలూ, తాంబూలంలో వంద రూపాయల కట్టా తెచ్చి పేరయ్యకిచ్చింది. పేరయ్య వాటిని అన్నింటినీ తుండుగుడ్డలో కట్టుకుని, "రమణమ్మా, బంగారంలాటి కోడలు, నీకు తగినది దొరికిందిలే!" అని వెళ్ళిపోయాడు.

రమణమ్మ గుండె తారెత్తిపోయింది, కాని అందరూ ఉండగా ఏమీ అనలేక పోయింది. తరవాత కోడలిని పిలిచి, "అమ్మాయ్, నేను మాటవరసకి అంటే, నిజంగా తెస్తావా? ఇకనుంచీ నేను ఎంత చెబుతానో అందులో సగమే తీసుకు రావాలి," అన్నది రమణమ్మ.

కొద్దిరోజుల అనంతరం రమణమ్మ వియ్యంకుడు కొందరు బంధువులతో సహా కూతురి కాపరం చూసి పోదామని వచ్చాడు. అందరూ పంక్తిలో కూర్చున్నారు. రమణమ్మ కూడా కూర్చున్నది. కోడలు వడ్డిస్తున్నది.

"నాకూ్కడా ఇంత అన్నం పడెయ్యవే!" అన్నది రమణమ్మ కోడలితో.

కోడలు అందరికీ వడ్డించుకుంటూ వచ్చి, అత్తగారి ముందున్న విస్తట్లో నాలుగు మెతుకులు రాల్చింది.

"అదేమిటి? అన్నం వడ్డించమంటే గరిట దులిపావు!" అన్నది రమణమ్మ.

"చెప్పినదాన్లో సగం వెయ్యమని నువేగదా అన్నావు?" అన్నది కోడలు.

రమణమ్మకు అవమానంతోపాటు కోపం కూడా వచ్చింది.

వచ్చిన చుట్టాలు, "రమణమ్మా, ఇంటి బాదరబందీ ఇంకా ఎంతకాలమని పడతావు? నీ బాధ్యత అంతా కోడలి నెత్తిన పెట్టి, కృష్ణా, రామా అనుకుంటూ కూర్చో," అన్నారు.

"అవును. మీరన్నది నిజమే," అని రమణమ్మ తాళపు చెవులు కోడలి చేతిలో పెట్టింది. అందరూ రమణమ్మ వివేకానికి మెచ్చుకున్నారు.

అందరూ వెళ్ళిపోయాక రమణమ్మ తన కోడలిని తాళం చెవులు తిరిగి ఇయ్యమన్నది.

"ఇంటి బాధ్యత నన్నే చూసుకో మన్నావు గదా?" అన్నది కోడలు.

"ఏదో మాట వరసకి అంటే నిజమను కున్నావా?" అని రమణమ్మ తాళం చెవులు తీసేసుకున్నది.

కోడలికి చాలా కోపం వచ్చింది, కానీ మాట్లాడక ఊరుకున్నది.

రమణమ్మ ఇంటి ముందర చింత చెట్లు ఉన్నాయి. చల్లగాలి కోసం రమణమ్మ ఆ చెట్ల కిందే పడుకునేది. ఒకనాటి అర్ధరాత్రి చెట్ల గుబురులోంచి దయ్యం వచ్చి, రమణమ్మ పీక పట్టుకుని,



"తాళం చెవులు ఇస్తావా? చంపెయ్యనా?" అని అడిగింది.

రమణమ్మ అరిచింది కాని లాభంలేకపోయింది. రమణమ్మ తాళం చెవులు దయ్యం చేతిలో పెట్టి, ఇంటిలోకి పరిగెత్తుకు వచ్చింది.

ఇంతలో దొడ్డివైపు నుంచి లోపలికి వచ్చిన కోడలు, "ఏమిటా అరుపులు? దయ్యం గాని పట్టుకున్నదా?" అని అడిగింది.

రమణమ్మ చెమటలు కక్కుతూ నిలువెల్లా వణుకుతున్నదిగాని జవాబు చెప్పలేదు.

"అహా! దయ్యం పట్టిన లక్షణాలు అచ్చగా ఇలాగే ఉంటాయి," అని కోడలు చీపిరికట్ట తెచ్చి అత్తగారిని బాదసాగింది.

నాకు దయ్యం పట్టలేదు. మొర్రో! అని రమణమ్మ ఏడవసాగింది.

"ఎందుకు పట్టలేదూ? నీకు ధనాశ దయ్యం కూడా పట్టింది," అన్నది కోడలు.

మర్నాడు కోడలు పేదసాదలందరికీ భారీ ఎత్తున అన్నదానమూ, వస్త్రదానమూ చేస్తూండటం చూసి, "ఇంత డబ్బు నీకెక్కడిది?" అని రమణమ్మ కోపంగా అడిగింది.

"ఎక్కడిదేమిటి? ఇదుగో తాళం చెవుల గుత్తి! ఇంటిముందున్న చింత చెట్టు మీది దయ్యం దీన్ని నాకిచ్చింది," అన్నది కోడలు.

"ఆ దయ్యం నీకెలా తెలుసు?" అని రమణమ్మ అడిగింది.

"అది నాకు వేలు విడిచిన అక్క!" అన్నది కోడలు.

ఈ మాట విని రమణమ్మ భయపడి, నోరు మూసుకున్నది. అది మొదలు ఆమె కోడలు చెప్పినట్టు వినసాగింది: వినకపోతే దయ్యం తనను చంపేస్తుందని భయం!

తల్లిలో ఈ మార్పు కలిగించినది తన భార్యే అని తెలిసి, సత్యం చాలా సంతోషించాడు.





# తెలివిగల ఇల్లాలు

పూర్వం ఒక ఊళ్ళో దానయ్య అనే గుమాస్తా ఉండేవాడు. అతను ఆ ఊళ్లో ఉన్న ఒక పెద్ద షావుకారు దగ్గిర చిన్న గుమాస్తాగా పనిచేసేవాడు. మామూలుగా షావుకారు గుమాస్తాలు బాగా డబ్బు చేసుకుంటారు. కాని దానయ్య అలా కాక చాలీ చాలని జీతం డబ్బులతోనే కాలక్షేపం చేసేవాడు. అతని భార్య తెలివి గలది కావటంచేత ఉన్నదాంట్లోనే ఇల్లు గడుపుతూ వచ్చేది. ఊళ్ళో వాళ్లు మాత్రం దానయ్య చాలా డబ్బు కూడబెట్టాడని నమ్మారు.

అదే ఉద్దేశంతో ఒకరోజు రాత్రి దానయ్య ఇంటికి ఒక ఘరానా దొంగ వచ్చాడు. అతను పగలు పెద్దమనిషిలా నటించేవాడు. అప్పుడప్పుడూ రాత్రి వేళ బయలుదేరి దొంగతనాలు చేస్తూ బతికేవాడు.

దొంగ దానయ్య ఇల్లంతా వెతికినా మామూలు వస్తువులు తప్ప నగా, నట్రా కనిపించలేదు. దానయ్య తన ధనమంతా ఎక్కడో రహస్యంగా దాచి ఉంటాడని, వాడు మొలలో నుంచి కత్తి లాగి, దానయ్యా, అతని భార్యా ఉన్న గది ప్రవేశించాడు.

అలికిడి విని ఆ దంపతులు నిద్ర లేచారు. నల్లని ముసుగు మొహానికి వేసుకున్న దొంగ కనబడగానే వాళ్ళు భయంతో వణికిపోయారు.

"ఇల్లంతా వెతికినా చీపురుపుల్ల కనిపించలేదు. డబ్బూ, నగలూ ఎక్కడ దాచావో మర్యాదగా చెప్పకపోయావో డొక్క చీరేస్తాను," అన్నాడు దొంగ, దానయ్య గుండె మీద కత్తి ఆనిస్తూ.

"పేదవాణ్ణి! నా దగ్గిర ఏముంటుంది? ఇంట్లో నీకు కనిపించినదంతా పట్టుకెళ్ళు,

అజీజ్

మమ్మల్ని వదిలి పెట్టు," అని దానయ్య చేతులు జోడించాడు.

దొంగ అతని మాటలు నమ్మక, దానయ్యను కొట్టసాగాడు. దానయ్య భార్య దొంగకు అడ్డం వచ్చి, "ఎందు కొచ్చినట్టు? ఇతన్ని దక్షిణపు గదిలోకి తీసుకుపోయి, దాచినదంతా ఇచ్చేద్దురూ ?" అన్నది.

దానయ్య భార్య ఎత్తు గ్రహించి, సరేనన్నాడు. అతను దొంగను వెంట పెట్టుకుని దక్షిణపు గదిలోకి ప్రవేశించగానే దానయ్య భార్య గది తలుపు మూసి, గడియ పెట్టేసింది.

దొంగ కిటికీ దగ్గిరికి వచ్చి, నివ్వెరబోయి చూస్తూ, "ఇదేమిటి? తలుపు మూశావు దేనికి?" అని దానయ్య భార్యను అడిగాడు.

దానయ్య భార్య నవ్వి, "మా దగ్గిర ధనం ఎక్కడిది, నాయనా? నిన్ను రాజభటులకు అప్పగించటానికే ఈ పని చెయ్యవలసి వచ్చింది," అన్నది.

దొంగ గడ గడ వణుకుతూ, "తల్లీ, నీకు పుణ్యం ఉంటుంది. ఆ పని మాత్రం చెయ్యకు," అంటూ ప్రాధేయపడ్డాడు.

దానయ్య భార్య కొంచెం సేపు ఆలోచించి, "సరే, అంతగా బ్రతిమాలుతున్నావు గనక నిన్ను వదిలిపెడతాను. కాని, నువ్వు బయటికి వచ్చి మళ్ళీ మమ్మల్ని కత్తితో బెదిరించవని ఏమిటి? ఆ కత్తిని బయటపడెయ్యి," అన్నది.



దొంగ వెంటనే తన చేతిలో ఉన్న కత్తిని కిటికీ కుండా బయటపడేశాడు.

అప్పుడామె గదిలో ఉన్న తన భర్తతో, "అలా చూస్తారేమండీ? ఇంతకుముందు వాడు కొట్టినదానికి వడ్డీతో సహా ఇచ్చుకోండి." అన్నది.

నిజానికి దొంగ కన్న దానయ్య బలం గలవాడే. వాడి చేతిలో ఇప్పుడు కత్తి లేదు గనక, దానయ్య దొంగను పట్టుకుని సున్నంలోకి ఎముక మిగలకుండా చావ తన్నాడు.

దొంగ చేతులు జోడించి ఏడుస్తూ, "తల్లీ, ఇకనైనా నన్ను వదిలెయ్యి. మళ్ళీ జన్మలో కూడా ఈ ఇంటి చాయలకు రాను" అన్నాడు.

"అప్పుడే ఎలా వదలను, నాయనా? జీతం డబ్బులు చాలక ఇంటి వాళ్ళకు నాలుగు నెలల అద్దె బాకీ ఉన్నాం. ఈ నెలాఖరుకు వంద రూపాయలు ఇచ్చెయ్యకపోతే ఇంటి యజమాని మమ్మల్ని వెళ్ళగొట్టుతాడు." అన్నది దానయ్య భార్య.

"ఆ వంద రూపాయలూ నే నిచ్చుకుంటాను, తల్లీ," అన్నాడు దొంగ.

"అది సరేగాని, మా దగ్గిర వంద రూపాయలు చేరినట్టు తెలిస్తే బాకీల వాళ్ళు ఊరుకుంటారా? కిరాణా కొట్టు కోమటికి వంద, పాలవాడికి వంద ఇయ్యాలి. ఈ బాకీలు తీర్చవలసినదే గదా, నాయనా?" అన్నది దానయ్య భార్య.



"ఆ రెండు వందలు కూడా నే నిచ్చు కుంటాను. తల్లీ! ఇకనన్ను వదిలిపెట్టు!" అన్నాడు దొంగ.

"అప్పుడేనా? వచ్చే సంక్రాతి పండక్కి నా కూతురూ, అల్లుడూ వస్తా రాయె! పిండి వంటలు చెయ్యాలి. బట్టలు పెట్టాలి. మూడు వందలన్నా ఖర్చు ఉంటుంది. దాని మాటేమిటి?" అన్నది దానయ్య భార్య.

"అంతా నేను భరిస్తానులే, తల్లీ. నన్ను వదిలిపెట్టు." అన్నాడు దొంగ.

"అంతగా అడుగుతున్నావు గనక అలాగే వదులుతాను గాని. మొత్తం ఆరు వందలూ నా చేతికియ్యమని మీ ఇంట్లో వాళ్ళ పేర ఉత్తరం రాసి, ఆ ఉత్తరంతో బాటు ఆనవాలుగా నీ ఉంగరం ఇయ్యి, నాయనా." అన్నది దానయ్య భార్య.

ఆమె కోరిన ప్రకారమే దొంగ ఉత్తరం రాసి, తన ఉంగరంతో సహా ఇచ్చాడు.

దానయ్య భార్య ఉత్తరం చదివి చూసు కుని. తల ఆడించి, "మరి నీ ఇల్లు ఎక్కడో నాకు తెలియదు గదా, నాయనా?" అన్నది.

దొంగ చేసేదిలేక తన ఇల్లు ఎక్కడో చెప్పాడు. అప్పటికే తూర్పు తెల్లవారు తున్నది. దానయ్య భార్య దొంగ ఇంటికి వెళ్ళి, దొంగ భార్యకు ఉత్తరమూ, ఉంగ రమూ చూపెట్టి, ఆరు వందలూ తెచ్చు కున్నది.

ఆమె తిరిగివచ్చి గది తలుపు గడియ తెరవగానే దొంగ 'బ్రతుకు జీవుడా!' అని బయటికి వచ్చాడు.

వెళ్ళిపోతున్న దొంగతో దానయ్య భార్య, "మళ్ళీ ఎప్పుడు వస్తావు, నాయనా?" అన్నది.

"ఆరు వందలు సంపాదించాక, తల్లీ!" అని దొంగ పరిగెత్తుకుంటూ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఇక ఆ ఊళ్ళో ఉండటం ప్రమాదమని ఆ రోజే వాడు మూటా, ముల్లే సర్దుకుని, తన భార్యతో సహా ఆ ఊరు విడిచిపెట్టి, ఎటో వెళ్ళిపోయాడు.







# వీర హనుమాన్

ఈ లోపల వానరవీరులు ప్రహస్తుణ్ణి ఎదుర్కొన్నారు. మరొకసారి వానరులూ, రాక్షసులూ అధికసంఖ్యలో పరస్పరం చంపుకున్నారు. ప్రహస్తుడి నలుగురు మంత్రులూ విజృంభించి వానరులను చంప సాగారు. అది చూసి ద్వివిదుడు అనే వానరవీరుడు పెద్ద కొండరాయి విసిరి, నరాంతకుణ్ణి చంపాడు. అలాగే దుర్ముఖుడు అనే వానరవీరుడు సమున్నతుణ్ణీ, జాంబవంతుడు మహానాదుణ్ణీ, తారుడు కుంభహనుణ్ణీ చంపారు. ప్రహస్తుడి మంత్రులు నలుగురూ చచ్చారు.

ఈ సంగతి కళ్ళారాచూసిన ప్రహస్తుడు అమితమైన క్రోధంతో వానరసేనను భయంకరంగా చెండాడసాగాడు. అప్పుడు ప్రహస్తుణ్ణి నీలుడు ఎదిరించాడు. ప్రహస్తుడు బాణాలతోనూ, నీలుడు చెట్లతోనూ యుద్ధం చేశారు. బాణాలు తన శరీరాన్ని ఎంత దారుణంగా హింసిస్తున్నా లెక్కచేయక, నీలుడు ప్రహస్తుడి రథపు గుర్రాలను చంపి, ప్రహస్తుడి ధనుస్సు పట్టుకుని విరిచేశాడు. చివరకు ప్రహస్తుడూ, నీలుడూ మల్లయుద్ధానికి దిగారు. ఆ యుద్ధంలో నీలుడు ప్రహస్తుడి తలను శిలతో పగలగొట్టాడు. రాక్షసులు ఏడుస్తూ లంకకు పోయారు.

వాళ్ళు వెళ్ళి రావణుడితో ప్రహస్తుడు చచ్చినట్టు చెప్పేసరికి రావణుడికి కోపం వచ్చింది. అతను తానే స్వయంగా

## 25. కుంభకర్ణుడి మేలుకొల్పు



యుద్ధానికి పోవటానికి నిశ్చయించుకున్నాడు. అతను ఉత్తమాశ్వాలు పూన్చిన తన రథం ఎక్కి బయలుదేరాడు.

అతను నగరం దాటి వచ్చేసరికి, రాళ్ళూ, చెట్లూ చేతపట్టిన వానరులసేన కనిపించింది. రావణుడు యుద్ధానికి వస్తూండటం చూసి రాముడు విభీషణుడితో, "ఆ మహాసేనలో రకరకాల ధ్వజాలతో వచ్చేవారు ఎవరు?" అన్నాడు.

విభీషణుడు రాముడికి ఒకొ్కక్కరినీ విడివిడిగా చెప్పాడు. వారిలో రావణుడి కొడుకు అకంపనుడు అనేవాడు ఒకడు ఉన్నాడు, ఇంద్రజిత్తు ఉన్నాడు; అతికాయుడూ, మహోదరుడూ అనేవాళ్ళున్నారు. ఇంకా రావణుడివెంట పిశాచుడూ, త్రిశురుడూ, కుంభుడూ, నికుంభుడూ మొదలైనవారున్నారు.

రాముడు రావణుడి తేజస్సు చూసి ఆశ్చర్యపోయాడు. అలాటి తేజస్సు దేవదానవులలో ఎవరికీ ఉండదనిపించింది. అయినా ఈ రావణుడు ఇప్పుడు తన ఎదట పడినందుకు రాముడు సంతోషించాడు; సీతను ఎత్తుకుపోయినందుకు ఇప్పుడు పగ తీర్చుకోవచ్చు! అందుకని రాముడు లక్ష్మణుడితో సహా యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా నిలబడ్డాడు.

వానరసేనను కలతపెడుతూ వచ్చే రావణుణ్ణి సుగ్రీవుడు ఎదిరించాడు. రావణుడు సుగ్రీవుణ్ణి ఒక్క బాణంతో మూర్ఛపోగొట్టాడు. రాక్షసులు సింహనాదాలు చేశారు.

అది చూసి గవాక్షుడూ, గవయుడూ, ఋషభుడూ, జ్యోతిర్ముఖుడూ, నభుడూ అనే వానరవీరులు శరీరాలు పెంచి, కొండరాళ్ళతో రావణుడి మీదికి వచ్చారు. రావణుడు అందరినీ బాణాలతో కొట్టాడు. వానరవీరులు బెదిరి, రాముణ్ణి శరణుజొచ్చారు.

రావణుడు వానరసేనను నిర్మూలిస్తూండటం చూసి, రాముడు వానరరక్షణకు బయలుదేరాడు. అది చూసి

లక్ష్మణుడు, రావణుణ్ణి చంపే అవకాశం తనకు ఇయ్యమని రాముణ్ణి ప్రార్థించాడు. లక్ష్మణుణ్ణి మెలకువగా ఉండమని హెచ్చరించి, రాముడు అతనికి అనుమతి ఇచ్చాడు.

లక్ష్మణుడు రావణుణ్ణి ఎదుర్కొన్నాడు. అది చూసి హనుమంతుడు ముందుగా తానే రావణుడి ముందుకు వెళ్ళి, కుడి చెయ్యి ఎత్తి, "నువు దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షసులను జయించావు నిజమే గాని, నీకు వానరుల మూలాన అపాయం ఉన్నది. ఈ నా చేత్తో నిన్ను చంపబోతున్నాను." అన్నాడు.



ఈ మాటకు రావణుడు మండిపడి, "హనుమంతుడా, నిర్భయంగా నన్ను కొట్టు. ఒక కోతి రావణుణ్ణి కొట్టిందన్న శాశ్వతకీర్తి నీకు దక్కుతుంది. ఆ తరవాత నేను నిన్ను చంపిపారేస్తాను." అన్నాడు.

"జ్ఞాపకంతెచ్చుకో, నీ కొడుకు అక్షుడు నా దెబ్బకే చచ్చాడు." అన్నాడు హనుమంతుడు.

రావణుడు హనుమంతుణ్ణి రొమ్ము మీద తన చేత్తో చరచాడు. ఆ దెబ్బకు చలించిన హనుమంతుడు కోపంతో రావణుడి రొమ్ము మీద బలంగా అరచేత్తో కొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు, భూకంపానికి పర్వతంలాగా, ఊగిపోయాడు. అదిచూసి వానరులు కోలాహలంగా హర్షధ్వానాలు చేశారు.

రావణుడు హనుమంతుడి పరాక్రమాన్ని ప్రశంసించాడు. కాని హనుమంతుడు, "రావణా, నా పరాక్రమం కాల్చనా? నా దెబ్బతిని కూడా నువ్వింకా బతికే ఉన్నావే! ఇంకొక్కసారి నువు నన్ను కొట్టు, ఆ తరవాత నేను నిన్ను పిడికిటిపోటుతో యమలోకానికి పంపేస్తాను." అన్నాడు.

కోపం వచ్చి రావణుడు తన పిడికిలితో హనుమంతుడి రొమ్ములో పొడిచాడు. హనుమంతుడు ఆ దెబ్బకు దిమ్మరపోయాడు. హనుమంతుడు తెప్పరిల్లి,



తనను మళ్ళీ పొడిచేలోగా రావణుడు నీలుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు.

వానర సేనానాయకుడైన నీలుడు రావణుడి బాణాల తాకిడికి బాగా నొచ్చి, రావణుడిపైన ఒక కొండశిఖరం విసిరాడు. ఈ లోపల తెప్పరిల్లిన హనుమంతుడు రావణుడి వద్దకు వచ్చి, ''ఇంకోడితో యుద్ధంచేస్తున్నావు గనక బతికిపోయావు!" అన్నాడు.

రావణుడు తన మీదికి వచ్చే కొండ శిఖరాన్ని బాణాలతో ముక్కలు ముక్కలు చేసేశాడు. తరవాత అతను నీలుణ్ణి ఆగ్నేయాస్త్రంతో మూర్ఛపోగొట్టి, లక్ష్మణుడి మీదికి వెళ్ళాడు.

"రాక్షసరాజా, ఈ వానరులతో ఎందుకు యుద్ధంచేస్తున్నావు? నాతో చెయ్యి." అన్నాడు లక్ష్మణుడు.

''లక్ష్మణా, నీకు ఆయువుమూడి నా ఎదటపడ్డావు. ఇప్పుడే నిన్ను యమపురానికి పంపుతాను,'' అన్నాడు రావణుడు.

''పాపాత్ముడా, ఆత్మస్తుతి చేసుకోకు. నీ శక్తి, బలమూ, పరాక్రమమూ నాకు బాగా తెలుసు. నేను యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాను,'' అన్నాడు లక్ష్మణుడు.

రావణుడు ఆగ్రహించి లక్ష్మణుడిపైన బాణాలు వేశాడు. లక్ష్మణుడు వాటిని దారిలోనే ఖండించాడు. ఇద్దరూ ఒకరినొకరు బాణాలతో కొట్టుకున్నారు. మధ్యలో లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అదిచూసి రావణుడు ముందుకు వచ్చి లక్ష్మణుణ్ణి పట్టుకుని ఎత్తబోయాడు. అంతలో హనుమంతుడు వచ్చి రావణుడి రొమ్ములో తన పిడికిలితో బలంగాకొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు బోర్లపడిపోయి, నోటా, కళ్ళా, చెవులా రక్తం కక్కాడు.

అదిచూసి హనుమంతుడు, మూర్ఛలో ఉన్న లక్ష్మణుణ్ణి తన చేతులలో ఎత్తుకుని, రాముడి వద్దకు తీసుకుపోయాడు.

కొద్దిసేపటికి లక్ష్మణుడికీ, రావణుడికీ కూడా స్పృహ తెలిసింది. రావణుడు మళ్ళా యుద్ధానికి సిద్ధపడ్డాడు.

అప్పుడు రాముడు రావణుడి మీదికి యుద్ధానికి వచ్చాడు. అదిచూసి హనుమంతుడు రాముడితో, "రావణుడితో యుద్ధం చెయ్యటానికి నువు నా మీద ఎక్కి కూర్చో," అన్నాడు.

రాముడు అలాగే చేశాడు. అతను హనుమంతుడి భుజం మీద ఎక్కి, రథం మీద ఉన్న రావణుడితో యుద్ధానికి వెళ్ళాడు.

రావణుడు తీవ్రమైన బాణాలను రాముడికి వాహనమైన హనుమంతుడిపై ప్రయోగించాడు. ఆ బాణాల మూలంగా హనుమంతుడి తేజస్సు మరింత హెచ్చింది. అయితే రాముడికి చాలా రోషం వచ్చింది; అతను రావణుడి రథచక్రాలనూ, గుర్రాలనూ, ధ్వజాన్నీ, గొడుగునూ, సారథినీ, ఆయుధాలనూ తన బాణాలతో కొట్టి రావణుడి రొమ్ములో నాటుకునేటట్టు బాణం వేశాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక రావణుడు చేతిలో ధనుస్సును జారవిడిచి, మూర్ఛపోయాడు.

రాముడు ఒక అర్ధచంద్రాకారం గల బాణంతో రావణుడి కిరీటం ఖండించి, రావణుడితో, "చాలామంది వీరులను చంపి, అలసిపోయి ఉన్నావు. ఇప్పుడు నిన్ను చంపను. నువు వెళ్ళి, విశ్రాంతి తీసుకుని, మళ్ళీ యుద్ధసన్నద్ధుడవై




రావటానికి అనుమతి ఇస్తున్నాను, వెళ్లు," అన్నాడు.

ఈ మాటలు అనిపించుకున్నందుకు సిగ్గుపడుతూ రావణుడు, చేసేదిలేక, లంకలోకి వెళ్ళిపోయాడు. తరవాత రామలక్ష్మణులు యుద్ధంలో గాయపడిన వానరులకు సేవలుచేశారు.

లంకకు తిరిగి పోయిన రావణుడు రాముడి బాణాలను తలుచుకుని భయపడి, తన అనుచరులతో, "ఇంద్రుడికి తీసిపోని నేను మనిషి చేతిలో ఓడాను! నేను చేసిన గొప్ప తపస్సంతా బూడిదలో పోసిన పన్నీరే అయిందిగదా! నాకు మనిషి వల్ల భయం ఉంటుందని పూర్వం



బ్రహ్మ చెప్పిన మాట ఇప్పుడు నిజమయింది. మనిషి వల్ల చావురాకుండా నేను బ్రహ్మను వరం కోరలేదు. రాక్షసులారా, ఈ కారణం వల్ల మీరు మరింత శ్రద్ధగా శత్రుసంహారం చెయ్యాలి. నగరాన్ని మరింత బాగా కాపాడాలి. మీలో కొందరుపోయి కుంభకర్ణుణ్ణి నిద్ర లేపండి,'' అన్నాడు.

కుంభకర్ణుడు యుద్ధం ప్రారంభంకావటానికి తొమ్మిది రోజులు ముందుగా నిద్రపోయాడు. అతను నిద్ర లేచి, యుద్ధానికి వెళ్ళి, రామలక్ష్మణులను చంపేస్తాడని రావణుడి నమ్మకం. ఎందుకంటే కుంభకర్ణుడికి ఎవరూ శాపాలు ఇయ్యలేదు.

రావణుడి ఆజ్ఞ పొంది రాక్షసులు గంధమూ, పూలమాలలూ, ఆహార పదార్థాలూ తీసుకుని కుంభకర్ణుడి ఇంటికి వెళ్ళారు. ఆ ఇల్లు చాలా పెద్దది. రాక్షసులు లోపలికి వెళ్ళటం చాలా కష్టమయింది. ఎందుకంటే, కుంభకర్ణుడు ఊపిరి విడిచినప్పుడల్లా ఆ గాలి రాక్షసులను వెనక్కు తోసేసింది.

అడ్డంగా పడిపోయిన పర్వతంలాగా కుంభకర్ణుడు పడుకుని గాఢమైన నిద్రలో ఉన్నాడు. అతన్ని లేపటం అసాధ్యం. అలాటి అసాధ్యమైన పనికి రాక్షసులు పూనుకుని, మొట్టమొదట అతని ముందు మాంసం రాశిగా పోశారు, మద్యపు బానలుంచారు, అతని శరీరమంతా చందనం పూశారు, అతని శరీరాన్ని పూలమాలలతో కప్పారు. తరవాత వాళ్ళు శంఖాలు ఊదారు, దొమ్మీగా అరిచారు, కుంభకర్ణుణ్ణి కొట్టారు, అటూ ఇటూ కదిలించారు, భేరీలు మోగించారు. కుంభకర్ణుడు లేవలేదు.

రాక్షసులు గదలూ, రోకళ్ళూ, గుదియలూ తీసుకుని కుంభకర్ణుణ్ణి చచ్చేట్టు కొట్టారు. అందువల్ల కూడా ప్రయోజనం లేకపోయింది. రాక్షసులు కుంభకర్ణుడి మీదికి గుర్రాలనూ, ఒంటెలనూ, గాడిదలనూ, ఏనుగులనూ తోలారు.

చిట్టచివరకు ఎలాగైతేనేం కుంభ కర్ణుడు మేలుకున్నాడు. లేస్తూనే అతనికి ఆకలివేసింది. అతను తన ఎదట ఉన్న ఆహారపు రాసులను తిని, బానల కొద్దీ మద్యం తాగి, రాక్షసులను కలయజూసి, "మీరు నన్నెందుకు లేపారు? రావణుడికి క్షేమమేగదా? ఇతర భయాలేమీ లేవు గదా?" అని అడిగాడు.

కాని ఏదో ముంచుకురావటం చేతనే రాక్షసులు తనను నిద్రలేపారని కుంభ కర్ణుడు గ్రహించాడు.

రావణుడి మంత్రి యూపాక్షుడు కుంభ కర్ణుడి ప్రశ్నకు ఇలా సమాధానం చెప్పాడు:

"కుంభకర్ణుడా, మనకు పూర్వం ఏ దేవతలవల్లా, దైత్యులవల్లా, దానవుల వల్లా కలగని భయం ఇప్పుడు మానవుల వల్ల కలుగుతున్నది. కొండలంతేసి వానరులు లంకను ముట్టడించారు. సీతను ఎత్తుకొచ్చినందుకు అలిగి, రాముడు పెద్ద భయం కలిగిస్తున్నాడు. ముందు ఒక్క వానరుడు లంక అంతా కాల్చి, అక్ష కుమారుణ్ణి సేనతో సహా చంపేశాడు. ఇప్పుడు రాముడు రావణుణ్ణి యుద్ధంలో కొట్టి, చచ్చాడనుకుని వదిలిపెట్టాడు. రావణుణ్ణి దేవతలూ, దైత్య, దానవులూ చెయ్యలేకపోయిన పనిని ఈ రాముడు చేశాడు."

తన అన్న యుద్ధంలో ఓడాడన్నమాట వినగానే కుంభకర్ణుడు కోపంతో యూపాక్షుడితో ఇలా అన్నాడు:

"నే నిప్పుడే వెళ్ళి వానరసేననూ, రామలక్ష్మణులనూ చంపేసి, తరవాత రావణుణ్ణి చూస్తాను. వానరుల రక్త మాంసాలు రాక్షసుల చేత తినిపించి, రామ లక్ష్మణుల రక్తాన్ని నేనే తాగుతాను."

కోపంతో ఒళ్ళు తెలియకుండా గర్వం కొద్దీ కుంభకర్ణుడు ఆడిన ఈ మాటలు విని, మహోదరుడు చేతులు జోడించి, కుంభకర్ణుడితో, "నువు ముందు రావణుడి వద్దకు వచ్చి, ఆయన చెప్పినది విని, మంచి చెడ్డలు ఆలోచించి, తరవాత శత్రువులను జయించు," అన్నాడు.





# అమరవాణి

అ పృ్యపాయై స్త్రిభి. స్తాత,
యోర్ధః ప్రాప్తుం న శక్యతే,
తస్య విక్రమకాలాం స్తా
న్యుక్తా నాహు ర్మనీషిణః. 1

[నాయనా, సామ దాన భేదాలతో సాధ్యం కాని దానికి దండోపాయం ప్రయోగించాలని పండితులు చెబుతారు.]

ప్రమత్తే. ష్వభియుక్తేషు,
దైవేన ప్రహృతేషు చ,
విక్రమా, స్తాత, సిధ్యంతి
పరీక్ష విధినా కృతాః. 2

[ఏమరిన వాళ్ళూ, వివశులూ, దైవం అనుకూలించని వాళ్లూ మొదలైనవారి యందు దండో పాయం వివేచనతో ప్రయోగించితే ప్రయోజనం ఉంటుంది.]

అప్రమత్తం, కథం తం తు
విజిగీషుం, బలేస్థితం,
జితరోషం, దురాధర్షం
ప్రధర్షయితు మిచ్ఛథ. 3

[అప్రమత్తుడూ, విజిగీషుడూ, బలవంతుడూ, రోషాన్ని జయించినవాడూ, ఎదిరించటం సాధ్యంగాని వాడూ—అలాటి వాణ్ణి ఎదిరించగోరడం ఎలాటిది?]

దండోపాయం

Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

చూడు నా దర్పం

పంపినవారు :
ఏ. ఉషారాణి

Photo by P. C. Dhir



కొండగామ్,
బస్తర్ జిల్లా.

మెడలో సర్పం

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు అక్టోబర్ 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి. అడ్రసు: ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ. మద్రాసు–26
* వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGIREDDI

# అమృతాంజన్

## తలనొప్పులకు జలుబులకు బెణుకులకు ఇంటింటా ఉండవలసిన దివ్యౌషధము







నొప్పులకు, జలుబులకు, బెణుకులకు ఉపశమనం కలిగించే అమృతాంజన్‌ను బాధగా ఉన్న చోట కొద్దిగా రాసి రుద్దండి. దానిలో చేరి ఉన్న పది శ్రేష్ఠమైన ఔషధాలు నిముషాలమీద గుణం కలిగిస్తుందని మీరు తెలుసుకొంటారు. ఆదాచేసే పెద్ద సీసాలలోను, చిన్న సీసాలలోను తక్కువ వెలకు ఇమిడికగా చిన్న డబ్బాలలోను లభిస్తుంది.

అమృతాంజన్ - 80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము.

అమృతాంజన్ లిమిటెడ్




AM-1255

# చందమామ కేమెల్

రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

**1 సెట్—మొదటి బహుమతి రు. 15**
**1 సెట్—రెండవ బహుమతి రు. 10**
**1 సెట్—మూడవ బహుమతి రు. 5**
**1 సెట్—5 కన్సొలేషన్ బహుమతులు**
**1 సెట్—10 సర్టిఫికెట్లు**



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.
**Chandamama 'Corinthian' Flat No. 5, 2nd Floor, 17 Arthur Bunder Road, Colaba,** Bombay-400 005. ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________________ Age ____________

Address ____________________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ.

**CONTEST NO.5**

VISION

ముక్కలు చెయ్యకుండా గీత వెంట కత్తిరించండి.

